# 155 ఏళ్ల తెలుగు పత్రికా చరిత్రలో

# అతి పెద్ద రికార్డ్






## సర్క్యులేషన్ 2,06,696 కాపీలు

(ABC June '93)

## 17,40,380 – అక్షరాలా పదిహేడులక్షల నలభైవేల మూడువందల ఎనభై మంది పాఠకులు వారం వారం చదువుతున్న ఏకైక వారపత్రిక

★ 1838లో 'వృత్తాంతి' అనే పత్రికతో తెలుగు పత్రికల చరిత్ర ప్రారంభమయ్యింది.
నాటినుండి నేటివరకు ఏ వారపత్రికా ఎరుగని అపూర్వ విజయం ఇది.

★ 1984లో ప్రారంభమైన 'స్వాతి సపరివార పత్రిక' అనతికాలంలోనే ఎన్నెన్నో రికార్డుల్ని సాధించింది.

★ 1989లో 'ఇండియన్ మార్కెట్ రీసెర్చ్ బ్యూరో' (IMRB) నిర్వహించిన సర్వేలో–
"ది బెస్ట్ వీక్లీ ఆఫ్ ది తెలుగు రీడర్స్"గా స్వాతి సపరివార పత్రిక మకుటధారణ చేసింది.

★ 1991లో లక్ష కాపీల సర్క్యులేషన్‌ను అధిగమించి, 'ఆడిట్ బ్యూరో ఆఫ్ సర్క్యులేషన్' (ABC) ద్వారా
"అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక"గా అగ్రస్థానంలో నిలిచింది.

★ ఇలా స్వాతి సపరివార పత్రిక నిరంతరపురోగమనంతో సాధిస్తున్న ఘనవిజయాలు, రికార్డులు ఎన్నెన్నో!

### తెలుగుజాతి గర్వించదగ్గ ఈ చారిత్రక సువర్ణఘట్టానికి కారకులైన పాఠకదేవుళ్లకు వందనాలు.

### సహకరించిన రచయిత(త్రు)లకు, చిత్రకారులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు, శ్రేయోభిలాషులకు అభివందనాలు.

**చేయెత్తి జేకొట్టు తెలుగోడా! స్వాతి చదివిన కీర్తిగలవోడా!**


ఎకోతో ముఖవైఖరులను తయారు చేయండి!
విషపూరితము కానిది.
సురక్షితమైనది.
ఎకో స్కెచ్ పెన్నులతో కృత్రిమ ముఖములను తయారు చేయడం ఎంతో సులువు మాత్రమే
కాకుండా అది ఎంతో ఉల్లాసవంతమైన వేడుక కూడాను!
ఎకో అనేక ప్రకాశవంతమైన రంగులలో, 12, 24, మరియు 30 పెన్నులుగల ప్యాక్‌లలో లభిస్తుంది.
అయితే అన్నింటికన్నా అత్యుత్తమమైన విషయమేమిటంటే, ఎకో నీటి-ఆధారముతో కూడినదై యుండి
మరియు విషపూరితము- కానిది. కనుక, ఉపయోగించుకోడానికి అది
మీకు సంపూర్ణముగా సురక్షితమైనదిగా ఉంటుంది.
ఒక్కసారి ఆలోచించు అదంటే అమ్మ ఎంతగా ఇష్టపడుతుందో.
ఎకో అంటే అంతులేని వినోదం!
గెలుచుకోండి వేలకొలది
బహుమతులు!
ఉచితం! కలరింగ్ బుక్ ప్రతీ ప్యాక్‌తో.
Ekco®
మీయంతట మీరు ప్రదర్శించు కోవడంలో ఇదే ఒక అత్యుత్తమమైన కళ.
Karishma/SW/6/2016 TL A

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి


## అన్ని మతాలకూ తగిన ఆదర్శ సూత్రం!

"ఇతరులు మన పట్ల ఎలా నడుచుకోవాలని మనం ఆశిస్తామో, మనం కూడా ఇతరుల పట్ల అలాగే నడుచుకోవాలి," అనే ఆదర్శ సూత్రాన్ని గత సెప్టెంబర్ నెలలో చికాగోలో జరిగిన విశ్వమత ద్వితీయ మహాసభలో పాల్గొన్న వారందరూ ఆమోదించారు.

క్రైస్తవమతం, ఇస్లాం, హిందూమతం, బౌద్ధమతం, జైనమతం, శిక్కుమతం, జొరాష్ట్రియన్‌మతం మొదలైన ప్రపంచంలోని ముఖ్యమైన దాదాపు 125 మతాల ప్రతినిధులు ఆ మహాసభలో పాల్గొన్నారు. ఏ మతానికి చెందినవారైనా సరే ఆచరించవలసిన ఆదర్శనైతిక సూత్రాలను ఆ సభలో రూపొందించారు. వాటిలో ప్రధానమైనది పైన కనబరచిన ఆదర్శసూత్రం!

ప్రపంచం ఈనాడు ఎదుర్కొంటూన్న వివిధ సమస్యలకు అహింసాత్మకమైన పరిష్కారాలు కనుగొనడం, ప్రకృతిని గౌరవించడం, స్త్రీ పురుషుల సమానత్వం మొదలైన అంశాలను ప్రముఖంగా పేర్కొన్న తొమ్మిది పేజీల తీర్మానంలో 'దేవుడు' అనే మాటను ఒక్కసారి కూడా ప్రస్తావించకపోవడం గమనించదగ్గ విషయం. అంటే 'దేవుణ్ణి' గుర్తించని మతాల వారికి కూడా ఆమోదయోగ్యంగా ఉండేవిధంగా ఈ సూత్రాలను రూపొందించారన్న మాట. ఇది స్వామి వివేకానంద ప్రబోధించిన సర్వమత సమైక్యతకు దగ్గరగా ఉన్నది. ఈ సూత్రాలు ప్రపంచ శాంతికి దోహదం చేయగలవని దలైలామా అభిప్రాయపడ్డాడు.

రెండువేల సంవత్సరాలకు పూర్వం ఏసుక్రీస్తు, "ఇతరులు మీకు ఇవ్వాలనుకున్నవే మీరు ఇతరులకు ఇవ్వండి!" అన్న సందేశాన్ని అందించాడు. ఈనాటి విశ్వమత మహాసభలో ఆ సూక్తినే కొద్ది తేడాతో మనకు తెలియజేయడం విశేషం!


సంపుటి: 92 డిసెంబర్ '93 సంచిక: 6

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



Sunday, Piano, Nursery Rhymes
It's Morton for me all the time
MORTON
SWEETS
I Love my Sundays ..... Nursery Rhymes and my Mummy close to me and Mortons all the time. It has been our Family's favourite for years and years.
Delicious and yummy in so many flavours. All with the goodness of
Creamy Milk, Glucose and Sugar.
Chocolate and Coconut Cookies, Rose Eclairs, Supreme
Chocolate and Coconut Toffees, Lacto Bonbons Mango King
and so many other delicious treats.
Um m m m m Every bite a yummy delight.
A lifetime of real goodness
MORTON CONFECTIONERY &
MILK PRODUCTS FACTORY
P.O. : Marhowrah 841 418 Dist. : Saran, Bihar
CC/M-1/93
Caution Notice :
MORTON and its wrappers are registered trade mark of Upper Ganges Sugar Industries Ltd. Any infringement of trade mark rights is liable to prosecution.

వార్తలు - విశేషాలు :

# ఇద్దరు నాయకులకు నోబెల్ శాంతి బహుమతి





ప్రతి యేడూ డిసెంబర్ నెలలో ప్రపంచ ప్రజల దృష్టి నార్వే రాజధాని ఓస్లో మీద ఉంటుంది. నోబెల్ బహుమతి నిర్ణయ కమిటీ అక్కడ ఉన్నది. ఈయేడు డిసెంబర్ 10వ తేదీ జరుగనున్న నోబెల్ బహుమతి ప్రదానోత్సవానికి ప్రత్యేకమైన విశిష్టత, చారిత్రక ప్రాముఖ్యత ఉన్నాయి. ప్రపంచం గౌరవించే ఇద్దరు నాయకులు - దక్షిణ ఆఫ్రికా ప్రెసిడెంట్ ఎఫ్. డబ్ల్యు. డీక్లార్క్, ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ అధ్యక్షుడు నెల్సన్ మండేలా ఉమ్మడిగా నోబెల్ శాంతి బహుమతిని అందుకుంటున్నారు.

ఒకప్పుడు బద్ధశత్రువులుగా ఉన్న ఈ ఇద్దరు నాయకులను నోబెల్ బహుమతి నిర్ణయ కమిటీ ఎందుకు ఎన్నుకున్నదో తెలుసుకోవాలంటే దక్షిణ ఆఫ్రికా చరిత్ర పుటలను తిప్పాలి. గత వంద సంవత్సరాలుగా దక్షిణ ఆఫ్రికాలో జాతివివక్షత అమలులో ఉన్నది. దక్షిణ ఆఫ్రికాకు వలస వచ్చి స్థిరపడిన అల్ప సంఖ్యాకులయిన తెల్లజాతి వారి ప్రభుత్వం అక్కడ అధికారంలో ఉన్నది. అది స్థానికులూ, అధిక సంఖ్యాకులూ అయిన నల్లజాతి వారిమీద ఎన్నో ఆంక్షలనూ, నిబంధనలనూ విధించి అమలు పరిచింది. నల్లజాతి వారికి ప్రభుత్వంలో ప్రాతినిధ్యం లేదు. పలుకుబడి లేదు. నల్లజాతి వారి జీవితాలు కొన్ని రంగాలకు మాత్రమే పరిమితం కావడం వల్ల ఆర్థికాభివృద్ధికిగానీ, విద్యాభివృద్ధికిగానీ అవకాశాలు లేకపోయాయి. దేశ సంపదలో వారికి వాటా లేకపోయింది.

అసమానత, అవమానం నిండిన బానిసబతుకులను ఎంతకాలమని సహించగలరు? న్యాయం, స్వాతంత్ర్యం, సమానత్వం మొదలైన హక్కుల కోసం చిన్న చిన్న ఉద్యమాలు తలెత్తాయి. 1960 వ సం॥లో న్యాయవాది అయిన నెల్సన్ మండేలా 'ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్' అనే గెరిల్లా సంస్థను

స్థాపించాడు. వెంటనే అతన్ని తీవ్రవాదిగా ప్రకటించి, జాత్యహంకార దక్షిణాఫ్రికా ప్రభుత్వం జైలులో పెట్టింది. ఆయన 27 సంవత్సరాలు జైలులో ఒంటరిగా గడిపాడు. దీనిని 'జాత్యహంకార దౌర్జన్యానికి వ్యతిరేకంగా సాగిన అచంచలమైన పోరాటంగా' చెబుతారు. మనదేశంలో గాంధీజీ నాయకత్వంలో సాగిన అహింసాయుత స్వాతంత్ర్య పోరాటంతో దీనిని పోలుస్తూ ఉంటారు.

అదేసమయంలో జైలుకు వెలుపల కూడా పోరాటం సాగుతూ వచ్చింది. ప్రభుత్వ అధినేతలు కూడా మారారు. 1989 వ సం॥లో న్యాయవాది ఎఫ్.డబ్ల్యు. డీక్లార్క్ అధికారంలోకి వచ్చాడు. ఆయన జాతి వివక్షత చట్టాలను క్రమంగా రద్దు చేయసాగాడు. నల్లజాతివారికి ప్రభుత్వంలో ప్రాతినిధ్యం కల్పించాడు. నల్లజాతి వారు దానిని అంగీకరిస్తూ తమ నాయకుని నిబంధనరహితంగా విడుదల చేయాలని కోరారు. 1990వ సం॥లో నెల్సన్ మండేలా విడుదల అయ్యాడు.

జైలు నుంచి విడుదల అయ్యాక, ఆయన ఎటువంటి ద్వేషభావమూ పాటించకుండా, 27 సం॥లకు పూర్వం ఉన్న లక్ష్యమే ఇప్పుడూ ఉన్నట్లు ప్రకటించాడు. తన దేశంలో తాను కోరుకుంటున్నది 'అధిక సంఖ్యాకుల పరిపాలన' మాత్రమేనని కేవలం 'అధిక సంఖ్యాకులయిన నల్లజాతివారి పాలన' కాదని తేటతెల్లం చేశాడు. తెల్లజాతి ప్రభుత్వంతో చర్చలు ప్రారంభించి కొనసాగించాడు. 'ఒక మనిషి - ఒక ఓటు' ఆధారసూత్రంగా గల నూతన ప్రజాస్వామ్య రాజకీయ విధానానికి నాంది పలికే ఒప్పందం కుదుర్చుకున్నాడు.

ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్, ఇతర సంస్థలు మూడేళ్ళ పాటు జరిపిన చర్చలు – శతాబ్దాలుగా సాగిన అపనమ్మకాన్ని తొలగించి, ప్రజాస్వామ్యస్థాపనకు దోహదం చేశాయి.

శాంతిస్థాపనకు ప్రయత్నాలు జరుగుతున్నప్పుడు, మరొక వైపున అక్కడక్కడ హింసాత్మక సంఘటనలు జరిగినప్పటికీ ఇద్దరు నాయకులూ – దక్షిణ ఆఫ్రికాలో నూతన ప్రజాస్వామ్య సంస్థాపనకు పునాదులు వేసే తమ కృషిని కొనసాగించారు. ఇదే నోబెల్ కమిటీ సభ్యుల దృష్టిని ఆకర్షించింది.

నోబెల్ బహుమతి గురించి తెలియగానే డీక్లార్క్, "ఇది గొప్ప గౌరవం. వినయంగా స్వీకరిస్తున్నాను," అన్నాడు. "ఇది దక్షిణాఫ్రికా ప్రజలందరినీ గౌరవించడం," అన్నాడు నెల్సన్ మండేలా. "ఆ బహుమతిని ఉభయులకూ ఉమ్మడిగా ఇవ్వడం మరీ బావున్నది," అన్నాడు 1984వ సం॥ నోబెల్ బహుమతీ గ్రహీత అయిన కేప్‌టౌన్ ఆర్చిబిషప్ డెస్మాండ్ టుటూ.

## ఇతర బహుమతీ గ్రహీతలు

*సాహిత్యం:* టోనీ మారిసన్ (అమెరికాకు చెందిన ఆఫ్రికన్ - అమెరికన్ రచయిత్రి.)

*వైద్యశాస్త్రం:* డా. రిచర్డ్ జె. రాబర్ట్స్ (ఇంగ్లాండు) డా. ఫిలిప్ ఏ. షార్ప్ (అమెరికా)

*భౌతికశాస్త్రం:* రస్సెల్ ఏ. హల్స్; ప్రొ॥ జోసెఫ్ హెచ్. టేలర్ (అమెరికా)

*రసాయనికశాస్త్రం:* క్యారీ బి.ముల్లిస్ (అమెరికా) మైఖేల్ స్మిత్ (కెనడా)

*అర్థికశాస్త్రం:* రాబర్ట్ డబ్ల్యు ఫోజెల్, ప్రొ॥ డగ్లాస్ సి. నార్త్ (అమెరికా)



# కనిపించని పనిమనిషి

సుందరి, కలవారిపిల్ల సుకుమారికి స్నేహితు రాలు. సుందరి పేదరాలే అయినా, ఒకరి ముందు దేహీ అని చేయిసాచని అభిమాన ధనం వున్న మనిషి. ఇద్దరూ అరమరికలు లేకుండా కలిసి మెలిసి వుండేవారు.

ఒకసారి సుకుమారి ఇంటికి దూరప్రాం తపు నగల వ్యాపారి వచ్చాడు. ఆయనవద్ద విలువైనవీ, అపురూపమైనవీ అయిన నగ లెన్నో వున్నాయి. సుకుమారి తండ్రి వాటిని చూసిఅబ్బురపడి నాలుగైదు హారాలు కొన్నాడు.

నగల వ్యాపారితో పాటు నలందుడనే యువకుడున్నాడు. వాడు రూపానికి నవమన్మ థుడు. చురుకుతనం, చమత్కారం వాడికి సహజంగా అబ్బాయి. అలాంటి వాడిని పెళ్ళి చేసుకోవాలని సుకుమారి మనసు పడింది. కానీ నేరుగా వాడితో మాట్లాడడానికి అభిమాన పడి, ఆమె సుందరిని పిలిచి తన మనసులోని మాట చెప్పి, "నగల వ్యాపారి సత్రంలో బస చేశాడు. నువ్వెలాగో అలా ఆ యువకుడిని కలుసుకుని నా గురించి చెప్పు. అత నొప్పు కుంటే మా నాన్నను ఒప్పించడం పెద్ద కష్టం కాదు. అతను నన్ను పెళ్ళాడితే ఇప్పటిలా ఊరూరా తిరగక్కర్లేదు. ఇంట్లోనే కాలు మీద కాలేసుకుని దర్జాగా రోజులు గడిపేయొచ్చు నని చెప్పు," అన్నది.

ఆ సాయంత్రమే సుందరి వెళ్ళి నలందు డిని కలుసుకుని, తనను తాను పరిచయం చేసుకుని సుకుమారి గురించి చెప్పింది.

నలందుడామెను చూస్తూవుండిపోయాడు. సుందరి మాట్లాడడం అయిపోగానే నలందుడు ఆమెతో, "నీ అందం నా మతి పోగొట్టింది. నువ్వేం చెప్పావో కూడా నాకు వినిపించలేదు. నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను. కాదంటే చచ్చిపోతాను," అన్నాడు.

ఊహించని ఈ పరిణామానికి భయపడి సుందరి చప్పున అక్కణ్ణించి వెళ్ళి పోయింది.

జొన్నలగడ్డ రామలక్ష్మి



నలందుడిపై ఆమెకు చాలా కోపం వచ్చింది. కానీ చేయగలిగిందేమీలేక సరేనన్నది.

సుందరికీ, నలందుడికీ పెళ్ళి జరిగింది. వాళ్ళిద్దరూ ఆ ఊరు వదిలి వెళ్ళి పోయారు. ఆ తర్వాత ఆ ఊళ్ళోనే ఒక భాగ్యవంతుడితో సుకుమారి వివాహం కూడా జరిగిపోయింది.

కొన్నేళ్ళు గడిచాయి. సుందరి చక్రపురంలో వుంటున్నట్లు సుకుమారికి తెలిసింది. ఆ భార్యాభర్తలు సుఖసంతోషాలతో కాలంగడుపుతున్నారని విని, ఆమె అసూయతో మండిపోయింది. తనెంత వైభవంగావుందో సుందరి భర్త నలందుడు తెలుసుకోవాలంటే, ఒకసారి వాళ్ళింటికి వెళ్ళాలని ఆమె నిర్ణయించుకున్నది. ఇందుకోసం పనిమనిషి నొకదాన్ని వెంటబెట్టుకుని చక్రపురం వెళ్ళింది.

సుందరి తన స్నేహితురాలిని ఎంతో అభిమానంగా ఆహ్వానించి ఆదరించింది. ఆమెకు సకల మర్యాదలూ చేసింది. నలందుడు, సుందరి ఎంతో అన్యోన్యంగావుండడం చూసి, సుకుమారి మరింత అసూయ చెందింది.

వచ్చిన మర్నాడు సుకుమారి జాలి పడుతున్నట్టు సుందరితో, "అయ్యో!నీఇంట్లో పనిమనిషయినా లేదే! నువ్వు పుట్టింటవుండగా, మీ నాన్న నీ చేత ఎంత చిన్న పనయినా చేయించేవాడు కాదు," అన్నది.

సుందరి నవ్వి, "మాకు పనిమనిషి లేకేం, వున్నది! కానీ అది నీకు కనబడకుండా అన్ని పనులు చేసుకు పోతున్నది. చూశావుగా, మా

నగల వ్యాపారి దూరం నుంచి వీళ్ళ సంభాషణ విన్నాడు. ఆయన నలందుణ్ణి సమీపించి, "ఆ పిల్ల బుద్ధిమంతురాలిలా వుంది. ఆమె నీభార్యఅయితే వృద్ధిలోకి వస్తావు. కానీ ఆమె తన స్నేహితురాలి తరపున వచ్చింది. నువ్వు సుకుమారితో మాట్లాడి ఆమెను ఒప్పిస్తే తప్ప, సుందరి నీతో పెళ్ళికి ఒప్పుకోదు," అన్నాడు.

మర్నాడునలందుడు, సుకుమారిని కలుసుకుని జరిగింది చెప్పి, "ఇందులో సుందరి తప్పేంలేదు. ఆమెను అపార్థం చేసుకోవద్దు. నే నామెను తప్ప ఇంకెవర్నీ పెళ్ళి చేసుకోను. నువ్వామెను పెళ్ళికి ఒప్పించు," అని కోరాడు.

ఇది విని సుకుమారి నివ్వెరపోయింది. తనను కాదని సుందరిని పెళ్ళాడాలనుకున్న

ఇల్లెంత శుభ్రంగా వుందో! పనిమనిషి లేకుం డానే ఇది సాధ్యమవుతుందంటావా?" అన్నది.

దాంతో సుకుమారి కుతూహలం పెరిగింది. కానీ ఆమె ఎంత నిఘా వేసినా పనిమనిషి కానరాలేదు. ఇలా నాలుగు రోజులు గడిచాక సుకుమారి తిరుగు ప్రయాణమయింది.

బయలుదేరే ముందుసుందరిచీరల మూట ఒకటి సుకుమారి ముందుంచి, "రాక రాక వచ్చి నన్నెంతో సంతోషపెట్టావు. నా జ్ఞాపకంగా వీటిలో నీకు నచ్చిన చీర ఏరుకో," అన్నది.

సుకుమారి వెంటనే తన పనిమనిషిని పిలిచి, అందులో నుంచి చీరను ఏరుకో మన్నది. అదేమిటని సుందరి ఆశ్చర్యపడితే, "నా తాహతుకుతగ్గ చీర నువ్వెలాగూ పెట్టలేవు. ఇలాంటి చీరలు కట్టుకుంటే నాకు పరువు తక్కువ కాబట్టి, పనిమనిషికే ఇస్తాను. ఎలాగూ దానికే ఇచ్చేటప్పుడు ఏకంగా దాన్నే ఏరుకోమంటే సరిపోతుంది కదా!" అన్నది.

సుందరి మౌనంగా వూరుకున్నది.

ఆ తర్వాత కొద్ది రోజులకు సుందరి పుట్టిం టికి వెళ్ళింది. సుకుమారి ఆమెను చూడవచ్చి, "నువ్వు వెళ్ళేలోగా మా ఇంట్లో భోంచేసి నేనిచ్చే చీర తీసుకోవాలి," అని చెప్పింది.

"తప్పకుండా వస్తాను. నేనూ నా వెంట పనిమనిషిని తీసుకొచ్చాగదా!"అన్నది సుందరి.

"అలాగా! మా ఇంటి కొచ్చేటప్పుడు తప్పక నీ పనిమనిషిని తీసుకురా," అంటూ మరీ మరీ చెప్పి వెళ్ళింది సుకుమారి.



తిరిగి వెళ్ళే ముందు సుందరి, సుకుమారి ఇంటికి ఒంటరిగా వెళ్ళింది. పనిమనిషి ఏదని సుకుమారి అడిగితే — నీ ఇంటికి దాన్నెలా తీసుకొస్తాను? అన్నది సుందరి. సుకు మారి మనసులో ఎంతో సంతోషించింది– స్నేహితురాలు తన హెూదాను గుర్తించిందని!

భోజనాలయ్యాక సుకుమారి ఒక చీరల మూటను సుందరి ముందుంచి, "నా గుర్తుగా ఒక చీర తీసుకో. ఇవి మామూలు చీరలు కావు. నువ్వు కట్టుకునే స్థాయివి. నేను కూడా ఇలాంటివే కట్టుకుంటాను. కాబట్టి నీకు నచ్చింది తీసుకో," అని గర్వంగా అన్నది.

సుందరి వాటిలోంచి ఒక చీర ఏరి, "నే నిచ్చిన చీరను నువ్వు పనిమనిషికిచ్చావు.

నేనూ నీ విచ్చిన చీరను, నా పనిమనిషికివ్వ డమే న్యాయం. దీన్ని నా పనిమనిషికే ఇస్తాను. ఏమీ అనుకోకు," అన్నది.

"ఇంత విలువైన చీరను పనిమనిషికి స్తావా?" అన్నది సుకుమారి ఆశ్చర్యపోతూ.

"నేను నా పనిమనిషికి ఎప్పుడూ నా స్థాయి బట్టలే ఇస్తాను,"అంటూనవ్వి వెళ్ళిపోయింది సుందరి.

ఇది జరిగాక సుకుమారికి మనసు మనసులో లేదు. సుందరి తనను బాగా అవహేళన చేసిందని అర్థమై ఆమె చాలా బాధపడింది.

నెల రోజుల తర్వాత సుకుమారి భర్తకు చక్రపురం వెళ్ళవలసినపని తగిలింది. తనూ వస్తానని సుకుమారి భర్తతో బయల్దేరి చక్రపురం వెళ్ళింది. భర్త తానొచ్చినపనులు చూసుకునే సమయంలో ఆమె సుందరి ఇంటికి వెళ్ళి తలుపు తట్టింది.

సుందరి వచ్చి తలుపు తీసింది. ఆమె బట్టలుతుకుతూ ఉతుకుతూ మధ్యలో రావడంవల్ల, ఒంటినిండా, ముఖం నిండా నీళ్ళు చెదిరి వున్నాయి. జుట్టంతా చిందరవందరగా వున్నది. అన్నిటికన్నా విశేషం — ఆమె సుకుమారి పెట్టిన చీరకట్టుకుని వుంది.

"నీ పనిమనిషిని చూద్దామని వచ్చాను. ఈ రోజు అది పనికి రాలేదా? దానికని తీసుకున్న చీర నువ్వు కట్టుకున్నావేమిటి?" అన్నది సుకుమారి ఆశ్చర్యంగానూ, వ్యంగ్యంగానూ.

సుందరి నవ్వి, "ఇంకా నీ కర్థం కాలేదా? నేనే నా పనిమనిషిని. నువ్వే చెప్పు? నీ తిండి నువ్వు తింటేనే బాగుంటుంది కదా – అలాగే నీ పని నువ్వు చేసుకుంటే బాగుంటుంది. అందుకే దేవుడు మనకు అన్ని అవయవాలూ ఇచ్చాడు. వాటిని వాడుకోకుండా, ఇతరుల చేత పనిచేయించుకునే వాళ్ళు వికలాంగుల తోసమానం. కానీ ఒక్క విషయం. నేనీ చీర కట్టుకున్నానని ఆశ్చర్యపోకు. ఇంటి పనులు చేసేటప్పుడే దీన్ని కట్టుకుంటాను!" అన్నది.

సుకుమారికి అప్పటికి సుందరి మంచితనం, తెలివి అర్థమై, "అసూయ, అహంకారం నన్ను నీ వంటి మంచి స్నేహితురాలికి దూరం చేస్తున్నాయి. ఇక నీతో పెళ్ళికి పూర్వంలాగే వుంటాను!"అని క్షమార్పణలు తెలుపుకున్నది.





# హామీ పత్రం

చంద్రం అనే పేదయువకుడొకడు, మల్లన్న శెట్టి దుకాణంలో గుమస్తా ఉద్యోగం ఖాళీగా వున్నదని తెలిసి, అక్కడికి వెళ్ళాడు.

మల్లన్నశెట్టి, చంద్రం వచ్చిన పని తెలుసుకుని, "నాకు గుమస్తా అవసరం వున్న మాట నిజమే. అయితే, నేను సరుకులు కొనుగోలు చేసుకురావడానికి, వారంలో ఒక రోజు పట్నం వెళుతూంటాను. ఆ రోజు దుకాణంలో జరిగిన అమ్మకం డబ్బు గుమస్తా దగ్గిరే వుంటుంది గదా! లోగడ నేను ఒకరిద్దరి వల్ల మోసపోయాను. అందువల్ల, నీకు ఉద్యోగం కావాలంటే, ముందుగా వెయ్యి రూపాయిలు పూచీకత్తుగా నాకు జమచేయాలి. లేదా నువ్వు నమ్మకమైన వాడివేనని ఇద్దరు పెద్దల చేత చెప్పించి, ఆ మొత్తానికి వాళ్ళచేత హామీపత్రం ఇప్పించు," అన్నాడు.

శెట్టి మాటలు విన్న చంద్రం ఒక్కక్షణం ఆలోచించి, "అయ్యా, సాయంత్రం దుకాణం మూశాక నా వెంట రండి. మీరడిగిన హామీలలో ఏదో ఒకటి ఇప్పించగలను," అన్నాడు.

ఆ సాయంత్రం చంద్రం, శెట్టిని వెంటబెట్టుకుని వడ్డీవ్యాపారి వరదరాజులు ఇంటికి వెళ్ళి, ఆయనతో తను వచ్చిన పనిచెప్పి వడ్డీకి వెయ్యిరూపాయిలివ్వమన్నాడు.

అందుకు వరదరాజులు నవ్వి, "నా ఇంటి పక్క గుడిసెలో కాపురం వుంటున్న నిన్ను చాలా కాలంగా ఎరుగుదును. శెట్టి నీకు రెండు వందలు జీతం ఇచ్చినా, అది నీ కుటుంబం బతకడానికే సరిపోతుంది. అందువల్ల, నువ్వు అసలు తీర్చే మాట అలా వుంచి వడ్డీ కూడా కట్టలేవు. ఇకవెళ్ళు!" అన్నాడు.

అప్పుడు చంద్రం, శెట్టితో, "అయ్యా, డబ్బు కోసం చేసిన ప్రయత్నం ఫలించలేదు. ఇక పెద్దమనుషుల చేత హామీ ఇప్పించే ప్రయత్నం చేస్తాను, రండి!" అంటూ శెట్టిని గ్రామపెద్ద గంగన్నదొర దగ్గిరకు తీసుకుపోయి,

వారణాశి శ్రీరామక్రిష్ణ

ఆయనకు తను వచ్చిన పని చెప్పాడు. గంగన్నదొర, చంద్రం కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "ఓహో, నీ పేరు చంద్రం అన్న మాట, సరే! వీధి వెంట పోతూ, నిన్ను చాలా సార్లు చూశాను. నీ ఈడు వాళ్ళు చాలామంది లా గిల్లికజ్జాలు పెట్టుకోవడం, గొడవలు పెట్టుకోవడం లాంటి చెడ్డ పనులు చేయవని, నా నౌకరు చెప్పగా విన్నాను. అంతమాత్రాన నీ ఉద్యోగానికి నేను హామీ వుండడం ఏమిటి? నేనేమైనా నీ పెదనాన్ననా, మేనమామనా? పోపో!" అనేశాడు.

చంద్రం మారుమాట్లాడకుండా శెట్టిని వెంటబెట్టుకుని గ్రామకొత్వాలు దగ్గిరకు వెళ్ళి, సంగతి చెప్పి హామీ వుండమన్నాడు.

కొత్వాలు, చంద్రం కేసి కళ్ళెర్రచేసి, "ఒరే, కొండంత వాణ్ణయిన నేను, గులకరాయి పాటిలేని నీకు నమ్మకస్థుడూ, సత్ప్రవర్తన గలవాడంటూ మల్లన్న శెట్టికి హామీ ఇవ్వాలా?" అంటూ చప్పట్లు చరిచి భటుణ్ణి పిలిచి, "వీడు రాటుతేలిన పాత నేరస్థుడై వుండాలి! అవునా?" అన్నాడు.

భటుడు, చంద్రాన్ని చూసి, "ఈ కుర్రవాడిది చెరువుకట్టదిగువనున్న కొంగల చింత పక్కన ఇల్లు. ఆ చుట్టుపక్కల ఇళ్ళ వాళ్ళందరూ మంచివాడు అని చెబుతూంటారు. పాపం, నిరుద్యోగి!" అన్నాడు.

భటుడి మాటలతో కొత్వాలు కాస్త శాంత పడి, "అలాగా!" అని తలాడించి, "ఏమైనా నిరుద్యోగయిన వాడు ఆట్టే కాలం దొంగకాకుండా వుండలేడు. ఒక కంట కనిపెట్టి వుండు!" అని భటుడికి చెప్పి, చంద్రంతో, "వేగిరం ఇక్కణ్ణించిపో! ఇది పెద్దమనుషులు కాలు పెట్టకూడని స్థలం!" అన్నాడు.

చంద్రం అక్కడి నుంచి శెట్టివెంట బయలు దేరాడు. దారిలో వాడు శెట్టిని, "అయ్యా, నేను దురదృష్టవంతుణ్ణి. ఏ ఒక్కరి నుంచీ నమ్మకస్థుణ్ణన్న హామీపత్రం సంపాయించలేకపోయాను," అన్నాడు.

ఆ మాటలకు శెట్టి చిన్నగా నవ్వి, "నువ్వు గ్రహించావోలేదో, ఇవ్వమంటూనే ఆ ముగ్గురూ నీకు ఎంతో విలువైన హామీపత్రా లిచ్చారు. రేపే వచ్చి ఉద్యోగంలో చేరు," అన్నాడు.





# విచిత్ర పుష్పం

## 9

[శతాబ్దిక పుష్పాలతో రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ వెళ్ళిన ఉత్తుంగుడు, అనుకోకుండా నాగపురి అనే నూతన ప్రదేశం చేరాడు. కోయదొర కాబూయీ ఉత్తుంగుణ్ణి ఆదరించి, రాజు దగ్గరికి తీసుకువెళ్ళాడు. ఉత్తుంగుడి సాహసాన్ని మెచ్చుకున్న రాజు, అతనికి తోడుగా కొందరు సైనికులను పంపుతానని మాట ఇచ్చాడు. ఆ రోజు సాయంకాలం, యువరాణి మల్లిక, ఉత్తుంగుణ్ణి వెంటబెట్టుకురమ్మని ఒక భటుణ్ణి పంపింది. — తరవాత]

ఉత్తుంగుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళిన రాజ భటుడు, అతన్ని రాజభవనంలోని ఒక విశాలమైనగదిలోకితీసుకుపోయి,"ఇక్కడే ఉండు, యువరాణిగారికి చెప్పి వస్తాను," అని లోపలికి వెళ్ళాడు.

ఉత్తుంగుడు అక్కడే నిలబడి, పక్కనున్న పెద్ద కిటికీ గుండా వెలుపలికి చూశాడు. ఆ గదిని ఆనుకుని కింద అందమైన ఉద్యాన వనం కనిపించింది. అతడు దానికేసి చూస్తూండగా, కిటికీ ఎదురుగా ఉన్న ద్వారం గుండా లోపలికి వచ్చిన యువరాణి మల్లిక, "అప్పుడే వచ్చావా?" అంటూ పలకరించింది.

ఉత్తుంగుడు ఆమెకేసి తిరగగానే, "నీకు పువ్వులంటే ఇష్టం కదూ. మరి నాకూ పువ్వులంటే ఇష్టమని నీకెలా తెలిసింది. ఆ అందమైన పువ్వులను నేను గదిలో భద్రంగా దాచుకున్నాను. అది సరే, ఆ శతాబ్దిక పుష్పాలకు శాపం ఎలా కలిగింది?" అని అడిగింది యువరాణి.



ఆ ప్రశ్నకు ఉత్తుంగుడు ఉలిక్కిపడి, మరుక్షణమే తేరుకుని, "శాపమా? ఎవరికి? శతాబ్దిక పుష్పాలకు శాపమేమిటి, యువరాణీ!" అన్నాడు ఏమీఎరగనట్టు.

"మా తండ్రితో మీరు చెప్పిన విషయం కొంత విన్నాను. ఉన్నట్టుండి భవనంలో సువాసన వీచడంతో, కారణం ఏమిటా అని మంత్రులతో చర్చలు జరుపుతున్న మా తండ్రి దగ్గరికి వచ్చాను. తండ్రి చేతిలోని పూల నుంచే ఆ సువాసన అని గ్రహించి, అటు సమీపిస్తున్నప్పుడు, ఆ పువ్వుల కోసం రాకాసిమృగం వస్తుందని కాబూయీ అనడంతో, అక్కడే ఆగ్గితెరచాటు నుంచి మీ మాటలు విన్నాను. అయినా, రాకాసిమృగానికి సైతం ఆ పువ్వులంటే అంత ఇష్టమని నాకు తెలియదు," అన్నది యువరాణి ఆశ్చర్యంగా కళ్ళు తిప్పుతూ.

ఉత్తుంగుడికి ఏం చెప్పడానికీ తోచక, "అవును, పువ్వులంటే నాకూ ఇష్టమే. అయితే నేనురాకాసిమృగాన్నికాను," అన్నాడు నవ్వుతూ.

"నిజమే, నువ్వు రాకాసిమృగానివి కాదు. కానీ, రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ వెళుతూన్న సాహసవీరుడివి! అవునా?" అని అడిగింది యువరాణి చిన్నగా నవ్వుతూ.

"ఆ పువ్వులను మీకోసమే తెచ్చాను, యువరాణీ! నన్ను నమ్మండి," అన్నాడు ఉత్తుంగుడు.

"నమ్మాలనే ఉన్నది. కానీ," అంటూ ఏదో చెప్పడానికి సంశయిస్తూ ఉత్తుంగుడి కేసి చూసింది యువరాణి.

"ఇంతకూ నన్ను పిలిపించిన కారణం చెప్పనే లేదు," అన్నాడు ఉత్తుంగుడు.

"నువ్వు రాకాసిమృగాన్ని ఎదుర్కోవడానికి వెళుతున్నావు గనక, మేము రాకాసిమృగం వంటి ఒక శత్రువును ఎదుర్కోవడానికి నీ సహాయం కోరుతున్నాను," అన్నది యువరాణి.

"మీకు శత్రువులా యువరాణీ! నాగపురికి శత్రువులే లేరని చెప్పాడే కాబూయీ," అన్నాడు ఉత్తుంగుడు ఆశ్చర్యంగా.

"నిజమే. నాగపురికి వెలుపలి నుంచి శత్రువులు లేరు. మా నుంచే ఒక శత్రువు బయలుదేరాడు," అన్నది యువరాణి.



ఎవరు? అన్నట్టుచూశాడు ఉత్తుంగుడు.

"మరెవరో కాదు; మా మేనమామ నాగసింహుడు. మా తండ్రి అతనికి సైన్యంలో దళనాయకుడి పదవి ఇచ్చాడు. అతడు దానితో తృప్తి చెందకుండా సేనాధిపతి పదవి కావాలని, తోబుట్టువయిన మా తల్లి ద్వారా తండ్రికి చెప్పించాడు. మా తండ్రి అందుకు ఒప్పుకోలేదు. దానికి ఆగ్రహం చెందిన మా మామ 'సేనాధిపతినే కాదు; నేను తలుచుకుంటే ఈ రాజ్యానికే రాజును కాగలను,' అని తన సహచరులతో గొప్పలు చెప్పుకోసాగాడు. ఆ విషయం తెలిసిన మా తండ్రి అతన్ని రాజభవనంలో అడుగు పెట్టవద్దని మందలించి పంపేశాడు. నన్నూ, తల్లినీ అతని పట్ల జాగ్రత్తగా వ్యవహరించమని మా తండ్రి మాకు సలహా ఇచ్చాడు," అన్నది యువరాణి.

"ఇప్పుడు సేనాధిపతి ఎవరు?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"దుర్జయుడు. మగ సంతానం లేనందువల్ల, నన్ను ఈ రాజ్యానికి రాణిని చేయాలన్నది మా తండ్రి అభీష్టం. ప్రజల క్షేమమే తన క్షేమంగా భావించే మా తండ్రి కూడా నాగసింహుడి వల్ల ప్రజలకు ఎటువంటి హానీకలగకూడదని అహర్నిశలు ఆలోచిస్తూన్నారని మా తల్లి ద్వారా తెలిసింది," అన్నది యువరాణి.

"ప్రజల క్షేమమే తన క్షేమంగా భావించే రాజుకు ఎటువంటి ఆపదా రాదు. సైనికుల కన్నా ప్రజలే రాజును రక్షించ గలరు. సరే, ఇప్పుడు నాగసింహుడు ఎక్కడున్నాడు?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"మా తండ్రి సలహా మీద, సేనాధిపతిఅతన్ని కొందరు సైనికులతోపాటు ఉత్తర సరిహద్దు కాపలాకు పంపాడు. రోజూ అతన్ని గురించిన సమాచారం రాజుకు అందుతూనే ఉంటుంది. అయినా అతడు ఎంతోకాలం ఊరుకోడనీ, సింహాసనం కోసం కుట్ర చేయగలడనీ మా తల్లి భయపడుతున్నది. ఈ విషయం నీకు చెప్పడానికే పిలిపించాను. నువ్వు ఇక్కడే కొన్నాళ్ళు ఉంటేమంచిది," అన్నది యువరాణి.

"అలాగే, యువరాణీ! అయినా నేనొక ముఖ్యమైన పనిమీద దూరప్రాంతానికి వెళుతున్నాను. ఈ విషయంలో రాజుగారు కూడా

నాకు సహాయపడతానని మాట ఇచ్చారు," అన్నాడు ఉత్తుంగుడు.

"ఆ సంగతి నాకూ తెలుసు. నాగసింహుడి గురించి నేను నీతో చెప్పిన సంగతి ఎవరికీ తెలియకూడదు. ఏదైనా సమాచారం అందితే, నీకు తెలియజేస్తాను. ఇక నువ్వు వెళ్ళు," అన్నది యువరాణి.

ఉత్తుంగుడు భటుడివెంట విడిదిని చేరే సరికి, అక్కడ కాబూయీ అతని కోసం ఎదురు చూస్తున్నాడు. ఆయన అడగకముందే, "యువరాణి, శతాబ్దిక పుష్పం గురించి వివ రాలడిగింది. మనం రాజుతో చెప్పిన కొన్ని విషయాలు ఆమె విన్నట్టుంది. వంద సంవత్సరాలకొకసారి పూచే అందమైన పుష్పం అదని చెప్పాను. అంతకుమించి నేను ఏమీ చెప్పలేదు," అన్నాడు ఉత్తుంగుడు యథాలాపంగా.

"మంచిపని చేశావు," అన్నాడు కాబూయీ మెచ్చుకోలుగా.

మరునాడు ఉదయం రాజు దగ్గరి నుంచి భటుడు రాగానే, కాబూయీ, ఉత్తుంగుడూ రాజదర్శనానికి వెళ్ళారు. వాళ్ళను చూడగానే రాజు, "నిన్న మనం అనుకున్నట్టు, ఉత్తుంగుడికి తోడుగా దళనాయకుడు నాగసింహుడితో పాటుసైనికులు మరికొందరిని పంపుతాను. నాగసింహుడు మన రాజ్యం ఉత్తర సరిహద్దులో ఉన్నాడు. అతడు రావడానికి రెండు మూడు రోజులు పట్టవచ్చు. అంతవరకు



ఉత్తుంగుణ్ణి ఇక్కడే ఉండనీ. నువ్వు కావాలంటే గూడానికి వెళ్ళు," అన్నాడు కాబూయీతో.

కాబూయీ, రాజుకు నమస్కరించి సెలవు తీసుకుని, ఉత్తుంగుణ్ణి అతని విడిదిలో వదిలి తన గూడానికి బయలుదేరాడు.

ఉత్తుంగుడు భోజనం చేసి, నగరంలోని వింతలను, విశేషాలను చూడడానికి బయలుదేరాడు. తీర్చిదిద్దినట్టున్న నగర వీధులు, వింత వింత భవనాలు అతనికి ఆశ్చర్యం కలిగించాయి. ఆ రాజ్యమెంతో సుభిక్షంగా, సుఖశాంతులతో తులతూగుతున్నట్టు ఉత్తుంగుడికి అనిపించింది. నాగసింహుడి కుట్ర ఫలితంగా రాజుకు ఏదైనా ఆపద కలిగితే ఆ రాజ్య ప్రజల గతి ఏమవుతుందో అని ఆలో



చిస్తూ ఉత్తుంగుడు సాయంకాలానికి తన విడిదినిచేరాడు. అలాగే రెండు రోజులు గడిచిపోయాయి. మూడవ రోజు సాయంకాలం, ఒక భటుడు వచ్చి, యువరాణి రమన్నట్టు చెప్పాడు. ఉత్తుంగుడు అతని వెంట రాజభవనానికి వెళ్ళాడు. అక్కడ అతని రాక కోసం ఎదురు చూస్తున్న యువరాణి, "మా మామ దళనాయకుడు నాగసింహుడు రాజధానికి వస్తున్నాడు. నువ్వు అతనిపట్ల జాగ్రత్తగా వ్యవహరించాలి. పైగా అతడు నాగపురిరాజ్య సింహాసనాన్ని కబళించడానికి ఏదైనా కుట్ర పన్నుతున్నాడా అని తెలుసుకోవడానికి ప్రయత్నించు. నువ్వు రాజుకు విశ్వాసపాత్రుడవని తెలిస్తే మాత్రం అతడు తన రహస్యం బయట పడనివ్వడు. సరే, నీ ప్రయాణం విజయవంతమయ్యాక తిరిగి ఇక్కడికి వస్తావా లేక అలాగే మాణిక్యపురికి వెళతావా?" అని అడిగింది.

"తప్పకుండా ఇక్కడికి వస్తాను. ఇక్కడి పరిస్థితులను చక్కదిద్ది మరీ వెళతాను, యువరాణీ!" అన్నాడు ఉత్తుంగుడు.

"నువ్వు చాకచక్యంతో మాట్లాడి నాగసింహుడి పథకాలను తెలుసుకున్నట్టయితే వాటిని భగ్నం చేయడం సులభమవుతుంది. ఈ విషయం చెప్పడానికే పిలిపించాను. ఇక వెళ్ళవచ్చు," అని లోపలికి వెళ్ళింది యువరాణి.

ఉత్తుంగుడు తన విడిదికి తిరిగి వెళ్ళాడు.

ఆ రోజే రాజ్యం ఉత్తర సరిహద్దుల నుంచి వచ్చిన దళనాయకుడు నాగసింహుడు సేనాధిపతి దుర్జయుడి దగ్గరికి వెళ్ళి, నమస్కరించి, "ఉన్నట్టుండి నన్నుపిలిపించిన కారణం ఏమిటి?" అని అడిగాడు.

"మాణిక్యపురి నుంచి కొన్ని పుష్పాలతో బయలుదేరి ఇటుగా వచ్చిన ఉత్తుంగుడనే యువకుడికి తోడుగా, నీ నాయకత్వంలో మన సైనికులు కొందరిని పంపాలని రాజు గారు నిర్ణయించారు!" అన్నాడు సేనాధిపతి.

"అతడు అసహాయశూరుడు కదా! ఇంత దూరం ఒంటరిగా వచ్చిన వీరుడు, ఇక పైవెళ్ళలేడా?" అన్నాడు నాగసింహుడు ఎగతాళిగా.

"నిజమే! అతడు ఒంటరిగా వెళ్ళడానికే నిశ్చయించాడు. మనసహాయం ఆశించి రాలేదు. కాని అతడు వెతుక్కుంటూ వెళుతున్నది

ఒక రాకాసిమృగాన్ని. ఆ రాకాసిమృగం శతాబ్దిక పుష్పాల కోసం, మాణిక్యపురిలో ప్రవేశించి నానాబీభత్సం సృష్టిస్తున్నదట. కాబట్టి దానిని అటువైపు రానీయకుండా చేయడానికే దాని నివాస స్థానం వెతుక్కుంటూ శతాబ్దిక పుష్పాలతో కోయయువకుడైన ఉత్తుంగుడు బయలుదేరాడు. ప్రజలక్షేమం కోసం, ఒంటరిగా బయలుదేరిన అతని ధైర్యసాహసాలకు ముగ్ధుడైన మన రాజుగారు మన సైనికులను కొందరిని పంపడానికి నిశ్చయించారు," అన్నాడు సేనాధిపతి.

నాగసింహుడు కొంతసేపు మౌనంగా ఆలోచించి, "రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ కేవలం ఒక కోయయువకుడు ఒంటరిగా బయలుదేరాడంటే మీరెలా నమ్మారు, సేనాధిపతీ?" అని అడిగాడు.

"మాణిక్యపురి నుంచి ఒంటరిగా ఇంత దూరం వచ్చిన ఆ యువకుడి మాటలను నమ్మకుండా ఉండలేము. పైగా, ఇది రాజాజ్ఞ! దానిని పాటించడమే మన బాధ్యత!" అన్నాడు సేనాధిపతి.

"చిత్తం, సేనాధిపతీ! మీ ఆజ్ఞను శిరసావహిస్తున్నాను. ఆయువకుణ్ణి ఎప్పుడు చూడమంటారు?" అని అడిగాడు నాగసింహుడు.

"రేపు ఇక్కడ ఇదే సమయానికి చూడవచ్చు! ఇక నువ్వు వెళ్ళు," అన్నాడు సేనాధిపతి.

నాగసింహుడు అక్కడినుంచి విసురుగా వెళ్ళిపోయాడు.



మరునాడు తెల్లవారగానే రాజుగారు రమ్మంటున్నారని ఒక భటుడు వచ్చి సేనాధిపతికి తెలియజేశాడు. సేనాధిపతి హుటాహుటిగా రాజభవనం చేరుకున్నాడు. రాజు గంభీర వదనంతో ఉన్నాడు. యువరాణి మల్లిక కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి.

"ఏం జరిగింది మహారాజా!" అని అడిగాడు సేనాధిపతి ఆతృతగా.

"శతాబ్దిక పుష్పాలు మాయమయ్యాయి. యువరాణి భవనంలో వాటిని దాచిన పూల కుండీలు అలాగే ఉన్నాయి. కాని పువ్వులు మాత్రం కనిపించడం లేదు. యువరాణి అంతఃపురంలో ప్రవేశించి ఇంత పనిచేసిన దుర్మార్గులు ఎవరై ఉంటారు? ఆ పూల

వాసన పరిచారికలందరినీ తప్పక ఆకర్షించి ఉంటుంది. అయినా, ఏ ఒక్కరు కూడా అవి ఎలా మాయమయ్యాయోచెప్పడం లేదు. ఆ పువ్వులు కనిపించలేదన్న విషయం, యువ రాణి స్వయంగా చూసి తెలుసుకున్నదే తప్ప, ఆ సంగతి అంతకు ముందు ఆమెకు ఎవరూ చెప్పలేదు. దొంగతనం అంత చాక చక్యంగా జరిగి ఉన్నది. ఆ పని ఎవరు చేసి ఉంటారో అంతుబట్టడం లేదు, సేనాధిపతీ!" అన్నాడు రాజు.

"రాజభవనం బాగా ఎరిగి ఉన్నవాళ్ళే ఈ పనిచేసి ఉండాలి. ఎందుకంటే రాజభవనం లోపలికి రాకాసిమృగం వచ్చే అవకాశం లేదు కదా?" అన్నాడు సేనాధిపతి.

"రాకాసిమృగమా? రాజభవనంలోకి రాకాసి మృగమా? మీరు ఏం చెబుతున్నారో అర్థం కావడం లేదు, సేనాధిపతీ!" అన్నది యువ రాణి ఆశ్చర్యంగా.

అంతలో రాజు కలగజేసుకుని, "అదేం లేదమ్మా, ఆ విషయం తరవాత చెబుతాను," అని, సేనాధిపతి కేసి తిరిగి, "ఇప్పుడా పుష్పాలను తిరిగి ఎలా సంపాయించాలో ఆలోచించాలి," అన్నాడు.

"చిత్తం, ప్రభూ! ఆ పనికి ఇప్పుడే మన భటులను పంపుతాను. అవి ఎక్కడున్నా సువాసనలు వెదజల్లుతూ ఉంటాయి కదా? కాబట్టి, తెలుసుకోవటం సులభం. దాంతో పాటు నిన్నటి నుంచి రాజభవనంలోకి ఎవ రెవరు వచ్చారో కాపలా భటులను అడిగి తెలుసుకుంటాను," అని కొంతసేపు ఆగి, "మరొక విషయం మహారాజా! నిన్ననే దళ నాయకుడు నాగసింహుడు వచ్చాడు. సైనికుల తోసహా ఉత్తుంగుడి వెంట వెళ్ళడానికి సమ్మ తించాడు, మహారాజా!" అన్నాడు సేనాధిపతి.

"నాగసింహుడు వచ్చాడా! నిన్నటి నుంచి రాజధానిలో ఉన్నాడా? శభాష్! అందుకే చిత్ర విచిత్రమైన సంఘటనలు జరుగుతున్నాయి!" అని కొంచెంసేపు మౌనంగా ఆలోచించి, "మొదట మీరు పుష్పాలు ఎక్కడున్నాయో వెతికి తెప్పించండి. ఆ తరవాత ఉత్తుంగుడి ప్రయాణం ఎప్పుడో నిర్ణయిద్దాం!" అన్నాడు రాజు.

—(ఇంకావుంది)






# మహిమగల ఉంగరాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒంటరిగా ఇంత నిశిరాత్రి వేళ, కేవలం భూతప్రేతాలు మాత్రమే సంచరించే ఈ శ్మశానంలో, కార్యసాధన కోసం మొక్కవోని ధైర్యసాహసాలతో నువ్వు చేస్తున్న కఠిన శ్రమను అభినందించ వలసిందే! అయితే, ఇంత కఠిన శ్రమ ఎవరి కోసం? ఎందుకోసం? అన్నది మాత్రం నా ఊహకు అందడం లేదు. ఒకవేళ నువ్వు ఏనాటికైనా కార్యసాఫల్యం పొందితే మాత్రం, అనంగ దేశపు యువరాణి అవంతిలా అవివేకంగా, అనుభవశూన్యుడిలా ప్రవర్తించకు. నీకు ముందు హెచ్చరికగా వుండేందుకు, ఆ రాకుమారి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



అనంగదేశం లోని, ఒకానొక కొండ చరియ గ్రామంలో జయుడు, విజయుడు, అజయుడు అనే ముగ్గురు క్షత్రియ యువకులుండేవారు. ముగ్గురికీ యుక్తవయసు వచ్చింది. ఎక్కడికి వెళ్ళినా ముగ్గురూ కలిసి వెళుతూండేవారు. ముగ్గురూ విడదీయలేని ప్రాణస్నేహితులు.

ఒక రోజు సాయంత్రం వాళ్ళు కొండమీది శివాలయంలో కలుసుకున్నారు.

"మన తల్లిదండ్రులు మనతో ఏ పని పాటలూ చేయించడం లేదు. రోజూ వేళకు తిని తిరగడం విసుగనిపిస్తున్నది. ఏదయినా ప్రయోజనం వుండే పని చేయకుండా ఎన్నాళ్ళిలా గాలికి తిరుగుతాం!" అన్నాడు జయుడు.

"నువ్వన్నది నిజం! మనం చదువు సంధ్యలునేర్చాం. మనలో ఇంతనరాని శక్తిసామర్థ్యాలున్నాయి. అయినా మనం ఎవరికీ ఉపయోగపడలేక పోతున్నాం," అన్నాడు విజయుడు బాధగా.

"త్వరలోనే మన పెళ్ళిళ్ళు అవుతాయి. అప్పుడు మనకిలా తిరిగే స్వేచ్ఛ వుండదు. ఈలోపలే మనం నలుగురికీ ఉపయోగపడే ఏదైనా ఘనకార్యం చెయ్యాలి," అన్నాడు అజయుడు మొలనున్న కత్తిపిడి మీద చేయి వేస్తూ.

వాళ్ళకు ప్రసాదం ఇవ్వడానికి వచ్చిన ఆలయ పూజారి ఈ మాటలు విని నవ్వి, "మీ ఆలోచన మెచ్చదగింది. ఉపయోగించని కత్తి, ఆలోచించని మనసూ తుప్పు పట్టి మొద్దుబారి పోతాయి. ఇక ఘనకార్యం మాటా? నిస్వార్థంగా పరులకు చేసే ప్రతి మేలూ ఘనకార్యం కిందే లెక్క! ఈ దాపుల నున్న అడవిలో ఒక పులి విచ్చలవిడిగా తిరుగుతూ గొర్రెలనూ, మేకలనూ ఎత్తుకు పోతున్నది. కాపరులు హడలి పోతున్నారు. సాహసించి దాన్ని చంపి గ్రామానికి మేలు చేయండి," అన్నాడు.

"పులిని చంపడానికి ఏపాటి సాహసం కావాలి? కంటబడితే బ్రహ్మరాక్షసుడినైనా నరికి పోగులు పెట్టగలం!" అని, ముగ్గురు యువకులూ ఏకకంఠంగా అని అక్కణ్ణించి బయలుదేరారు.

మర్నాడు ముగ్గురూ సూర్యోదయానికి కొంచెం ముందుగా అడవిలోకి వెళ్ళారు. వాళ్ళు మధ్యాహ్నం వరకూ అడవి అంతా గాలించినా, ఎక్కడా పులి కనిపించలేదు. వాళ్ళు నిరాశ చెంది, అక్కడ దొరికిన చెట్ల ఫలాలు తిని, సెలయేటిలో నీళ్ళు తాగుతుండగా, దాపుల వున్న ఒక కొండ గుహలోంచి, ఎవరో ప్రాణాపదలో వున్నట్టు ఆర్తనాదం వినిపించింది.

వెంటనే ముగ్గురూ, ఈసారి పులి ఏ గొర్రెనోకాక, మనిషినే పట్టి తినబోతున్నదనుకుంటూ, ఆ దిక్కుకేసి పరిగెత్తారు. అయితే, వాళ్ళు గుహను సమీపించేసరికి ఒక మహాసర్పం పడగ విప్పి బుసలుకొడుతూ బయటికి వచ్చింది. ముగ్గురూ ఒకేసారి తమకత్తులతో ధాన్ని కొట్టారు. సర్పం మూడు ముక్కలుగా తెగిపోయింది.

ఇంతలో గుహ లోపలి నుంచి మనిషి మూలుగు వినవచ్చింది. ముగ్గురూ లోపలికి వెళ్ళారు. అక్కడ మసక చీకటిలో, మధ్యవయస్కుడైన సాధువొకడు చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడుతూ కనిపించాడు.

"ఏమిటిది, స్వామీ! మా గ్రామం పక్కనున్న కొండగుహల్లో సాధువున్నట్టు, ఈ క్షణం వరకూ మాకు తెలియదే!" అన్నాడు జయుడు.

కొసప్రాణంతో వున్న సాధువు వాళ్ళతో, "దురాశనన్నిక్కడికి హిమాలయాలనుంచి ఈడ్చుకొచ్చింది, బాబూ! సాధువునైన నేను సంసారినై మహారాజభోగాలనుభవిద్దామని, మా గురువు నుంచి మహత్తుగల మూడు





ఉంగరాలు దొంగిలించి, ఇక్కడికి పారిపోయి వచ్చాను. కాలసర్పం నన్ను కాటు వేసింది. మరణించే ముందు ఆ ఉంగరాలు మీకిస్తు న్నాను. ఇందులో ఒకటి ఎర్రరాయి ఉంగరం. దాన్ని ధరిస్తే, సమయానుకూలంగా మంచి ఆలోచనలు వస్తాయి. రెండోది పచ్చరాయి ఉంగరం. దానివల్ల, ఆ ఆలోచనలన్నీ ఎప్పుడు ఏ విధంగా ఆచరణలో పెడితే సత్ఫ లితాలు కలుగుతాయో తెలుస్తుంది. మూడ వది నీలంరాయి ఉంగరం. దానివల్ల, ముందు చెప్పిన వాటినన్నిటినీ సాధించే శక్తి వస్తుంది! మీరు ముగ్గురున్నారు. తలా ఒకటి తీసుకోండి!" అని, ఎర్రరాయి ఉంగరాన్ని జయుడికీ, పచ్చరాయి ఉంగరాన్ని విజయుడికీ, నీలం రాయి ఉంగరాన్ని అజయుడికీ ఇచ్చి కన్ను మూశాడు.

ఈ జరిగినదంతా, ఆ ముగ్గురికీ కలా, నిజమా అన్నంత ఆశ్చర్యం కలిగించింది.

వాళ్ళు ఆ కొండ ప్రాంతంలో వున్న చంద నపు కర్రలతో, సాధువుకు దహనసంస్కారాలు చేసి, చీకటిపడి ఇల్లు చేరుకున్నారు.

ఆ రాత్రి ఆ ముగ్గురికీ కంటి మీద కునుకు లేదు. ఎవరికివారే ఆ ఉంగరాలు తమ వద్దకన్నా, రాజుగారి దగ్గిర వుంటే దేశానికి ప్రయోజనం అని భావించారు. ఇంట్లో వాళ్ళకు తెలిస్తే, వాటిని రాజుగారికి కానుకగా ఇవ్వ డానికి ఒప్పుకోరు. ఇలా ఆలోచించి, ముగ్గురూ వేకువజామున కొద్ది వ్యవధిలో ఒకరి వెనక ఒకరు గుర్రాల మీద రాజధానీ నగరానికి బయలుదేరారు.

ముందు జయుడు రాజుగారిని కలుసు కుని, "మహారాజా! నా దగ్గిర అద్భుతమహిమ గల ఉంగరంవున్నది. దేశాభ్యుదయానికి అవ సరం అయిన ఆలోచనలు రావడానికి ఇది దోహదం చేస్తుంది. నాలాంటి సామాన్యుడి దగ్గిరకన్న, ఇది మీ దగ్గిర వుంటే ప్రజలందరికీ మేలు కలుగుతుంది. దీన్ని మీకు కానుకగా సమర్పించుకోవడానికి వచ్చాను!" అని, ఎర్ర రాయి ఉంగరాన్ని రాజుగారి కిచ్చాడు.

"ఇంత విలువైన కానుకను ఇచ్చినందుకు సంతోషంగా వుంది. కొన్నాళ్ళు నువ్వు, నాకు అతిథిగా వుండు," అన్నాడు రాజు.

కొద్దిసేపట్లో విజయుడు, రాజుగారి దగ్గిరకు వచ్చి, పచ్చరాయి ఉంగరాన్ని ఆయనకిస్తూ, "మహారాజా! ఈ ఉంగరం మహిమ వల్ల, తమకు నచ్చే మంచి ఆలోచనల్ని, ఏ విధంగా ఆచరణలో పెడితే సత్ఫలితాలిచ్చి ప్రజలకు మేలుకలుగుతుందో తెలుస్తుంది!" అన్నాడు.

రాజుగారు, విజయుణ్ణి కూడా కొన్నాళ్ళపాటు తనకు అతిథిగా వుండమన్నాడు.

ఆ తర్వాత అజయుడు అక్కడికి వచ్చి, రాజుగారికి నీలంరంగురాయి ఉంగరం ఇచ్చి, "మహారాజా! ఈ మహాద్భుతమైన ఉంగరాన్ని తమకుసమర్పించుకుంటున్నాను. ఈ ఉంగరంవల్ల, తమకు ప్రజల క్షేమం కోసం వచ్చే ఆలోచనల్ని ఆచరణలో సుసాధ్యం చేసుకోగల శక్తిసామర్థ్యాలుఅలవడుతాయి!"అనిచెప్పాడు.

ఈ ఉంగరం, మిగతా రెంటికన్న మరింత అద్భుతమైనదిగా తోచింది రాజుగారికి. ఆయన అజయుణ్ణి కూడా తనకు అతిథిగా వుండమన్నాడు.

రాజుగారికి అవంతి ఒక్కగా నొక్క కూతురు. ఆమె వివాహం జరిపించి, అల్లుడికి పట్టాభిషేకంచేసేఆలోచనలోవున్నాడాయిన. అయితే, అవంతికి మాత్రం ఏరాజ్యపు యువరాజూ నచ్చడం లేదు.

ఏ యువరాజు ప్రసక్తి వచ్చినా ఆమె, "చూడబోతే వాళ్ళు నాకన్నా, నా ద్వారా లభించే రాజ్యం మీద కన్నువేసినట్టుగా కనిపిస్తున్నారు. నా పెళ్ళి నాకు నచ్చిన వాడితోనే కాదు, రాజ్యప్రజలు మెచ్చే వాడితో – వేయేల, ఈ రాజ్యాన్ని ప్రేమించే వాడితో జరగాలి!" అంటూ





గజిబిజిగా మాట్లాడి, వచ్చిన ప్రతి సంబంధాన్నీ తిరస్కరిస్తున్నది.

రాజు ఆ సాయంత్రం మూడు ఉంగరాలనూ తీసుకుని, తన కుమార్తె మందిరానికి వెళ్ళి, ఆమెకు వాటి మహిమ గురించి చెప్పి, "అమ్మా! ఈ ముగ్గురు యువకులూ అందగాళ్ళు, చాలా తెలివిగల వాళ్ళు, సాహసవంతులు. ఈ ఉంగరాలను నాకు కానుకగా ఇచ్చారు," అన్నాడు.

"ఆ యువకులను ఇంతకుముందే ఉద్యాన వనంలో తిరుగుతూండగా చూశాను," అన్నది అవంతి.

"ముగ్గురూ యోగ్యులు. మనదేశక్షేమాన్ని కోరేవారు. వాళ్ళిచ్చిన ఉంగరాలను తిరిగి వాళ్ళకు ఇచ్చేయ దలిచాను. వాళ్ళల్లో నీకు నచ్చిన యువకుణ్ణి వివాహమాడితే, నాకు మనశ్శాంతిగా వుంటుంది," అన్నాడు రాజు.

"వాళ్ళ అభిప్రాయం కూడా తెలుసుకోవాలి గదా!" అన్నది అవంతి.

ఆమె వివాహానికి అభ్యంతరం చెప్పకపోయే సరికి రాజు పొంగిపోయి, "ముందు నీ అభిప్రాయం చెప్పు! ఆ ముగ్గురిలో ఎవరిని వివాహమాడ దలిచావు?" అని ప్రశ్నించాడు రాజు.

అవంతి సిగ్గుతో తలవంచుకుని, "నాన్నా! మీరు ఎవరి ఉంగరాలు వారికి తిరిగి ఇచ్చేస్తున్నారుగనక, ఎర్రరాయి ఉంగరం ఇచ్చిన జయుడితోనే, నా వివాహం జరిపించండి," అన్నది.

రాజు, ఆమెను మరేమీ ప్రశ్నించకుండా, జటిలమైన కుమార్తె వివాహసమస్య, ఆమె వల్లనే పరిష్కారమైందన్న సంతోషంతో, జయుడితో ఆమె వివాహం జరిపి, అతణ్ణి రాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

జయుడు అనంగ దేశానికి రాజవుతూనే, విజయుడికి మంత్రి పదవీ, అజయుడికి సేనాధిపతి పదవీ ఇచ్చాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, యువరాణి అవంతి, జయుణ్ణి తన భర్తగా కోరడం అవివేకం అనిపించుకోదా? మానవనైజాన్ని ఎంతో సునిశితంగా పరిశీలించినదానిలాగా, ప్రతిదేశపు యువరాజునూ, తన ద్వారా లభించనున్న రాజ్య సింహాసనం మీద కన్నువేశాడని

తిరస్కరించిన ఆమె, జయుడితో వివాహానికి ఎందుకు అంగీకరించినట్టు? అతడికి సింహాసనం మీద ఆశ లేదనేందుకు రుజువేమిటి? ఒకవేళ ఆ ముగ్గురు యువకుల్లో ఒకణ్ణి వివాహమాడక తప్పని పరిస్థితి ఏర్పడిందని అనుకున్నా, కోరిన ప్రతిదాన్నీ సాధించే శక్తి గల నీలపురాయి ఉంగరాన్ని తండ్రికిచ్చిన అజయుడు అందుకు అర్హుడుగదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సాధువు తమకిచ్చిన మహిమగల ఉంగరాలను, తమ దేశపు రాజుకు సమర్పించాలని అనుకోవడంలోనే, ముగ్గురు యువకులూ నిస్వార్థపరులనీ, ధనకాంక్షా, రాజ్యకాంక్షా లేనివారనీ తెలుస్తున్నది. ఈ స్వల్పవిషయాన్ని రాకుమారి అవంతి గ్రహించడం ఏమంత కష్టంకాదు. ఇక, వాటి మహిమల గురించి ఆలోచించినప్పుడు పచ్చరాయి గల ఉంగరం మరొకరికి వచ్చిన మంచి ఆలోచనలను, ఎప్పుడు ఆచరణలో పెట్టాలో తెలుపుతుంది. అలాగే నీలపురాయి ఉంగరం, వాటిని సాధించే శక్తినిస్తుంది. కాని, ఎర్రరాయి ఉంగరం మాత్రం రాజుకు దేశ క్షేమానికి అవసరం అయిన మంచి ఆలోచనలు కలిగేలా చేస్తుంది. అంటే, మిగతా రెండు మహిమలు గల ఉంగరాలకు ప్రేరణనిచ్చే మూలశక్తి ఎర్రరాయి ఉంగరం అన్నమాట! ఆ ఉంగరం జయుడి దగ్గర వున్నది. ఆ కారణం వల్లనే అవంతి, అతణ్ణి తన భర్తగా వరించింది. దీన్ని గ్రహించడం వల్లనే జయుడు, తన ఆలోచనల్ని ఆచరణలో పెట్టేందుకు తగిన సలహా లివ్వగల విజయుణ్ణి మంత్రి గానూ, వాటిని సాధించే శక్తి గల అజయుణ్ణి సేనాధిపతిగానూ నియమించుకున్నాడు. ఈ కారణాల వల్ల, అవంతి అవివేకురాలు కాకపోగా, ఎంతో కుశాగ్రబుద్ధి గలదని రుజువవుతున్నది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : మాచిరాజు కామేశ్వరరావు రచన]



# మాటవినే కుక్క!

హేలాపురి సంతలో ఒకవ్యక్తి, ఒక కుక్కను అమ్మకానికి పెట్టి, చుట్టూ మూగిన జనానికి దాని గుణగణాలను ఏకరువు పెడుతూ, "ఈ కుక్క మీరేమాట చెప్పినా వింటుంది. మీరే పని చెప్పినా చేస్తుంది, అదెంత కష్టమైన పనైనా సరే!" అన్నాడు.

చుట్టూ మూగిన వారిలోంచి ఒకడు, "అయితే, ఇంత మంచి కుక్కను, చెప్పిన మాట వినే దాన్ని, చెప్పిన పనులు ఎంత కష్టమైనా చేసేదాన్ని ఎందుకమ్మేస్తున్నావు?" అని అడిగాడు.

ఇందుకు కుక్కనమ్మేవాడు, "అయ్యా, ఏం చెప్పమంటారు? నిన్న రాత్రి నా ఇంట్లో దొంగలు పడ్డారు. ఈ కుక్క వాళ్ళు చెప్పిన మాటలన్నీ విని, వాళ్ళు చెప్పిన పనులన్నీ చేసింది. వాళ్ళు చెప్పిన విధంగా — మొరక్కుండా, నన్నూ, నా భార్యనూ ఆ దొంగలు గుంజకు కట్టేస్తుంటే, ఆ పనిలో వాళ్ళకు సాయం చేసింది. పైపెచ్చు లాంతరు నోట కరుచుకుని, వాళ్ళడిగినట్టు ఇల్లంతా తిప్పి ఎక్కడెక్కడ ఏ వస్తువులున్నాయో, ఆ దొంగలకు చూపించి మరీ నా ఇల్లు గుల్లచేయించింది!" అంటూ కోపంతో గట్టిగా పళ్ళు కొరికాడు. ఇది విని చుట్టూ మూగినవాళ్ళు విరగబడినవ్వారు.

—కోనే నాగవెంకట ఆంజనేయులు



# చందమామ అనుబంధం - 62

మనదేశపు పక్షులు - జంతువులు:

## ఆటలాడే ఎలుగుబంటి

మనదేశంలో కొండలు, బండరాళ్ళు నిండిన అడవులలో నివసించే ఎలుగుబంట్లకు రొమ్ము మీద 'V' ఆకారంలో తెల్లటి చార ఉంటుంది. ఈ జాతి ఎలుగుబంట్లను సులభంగా పట్టుకుని, మచ్చిక చేసి కొన్ని ఆటలు కూడా నేర్పవచ్చు. ఇటువంటి ఎలుగుబంట్లను గ్రామాలలో ఆటలాడిస్తూ ఉంటారు. మన 'సర్కస్'లోనూ ఎలుగుబంటి సాహసాలు ముఖ్యమైన అంశంగా ఉంటున్నది. పిల్లిమొగ్గలు వేస్తూ, ఒక్క రోమం కూడా కాలిపోకుండా మండుతూన్న వలయం గుండా గెంతుతూ ఎలుగుబంట్లు ప్రేక్షులకు వినోదం కలిగిస్తాయి.



ఈ ఎలుగుబంటి దాదాపు 250 సెం.మీ. పొడవు ఉంటుంది. ఇది మనిషి లాగా రెండు కాళ్ళ మీద నిలబడగలదు. నిలబడినప్పుడు దీని ఎత్తు 65 - 85 సెం.మీ. ఉంటుంది. దీని అడుగుజాడలు కూడా దాదాపు మనిషి అడుగు జాడలలాగే ఉంటాయి. ఊదా – నలుపు రంగు లో ఉండే ఈ ఎలుగుబంటి ముక్కు తెలుపూ - బూడిదరంగు కలిసినట్టు ఉంటుంది. తెల్లటి పొడ వాటి గోళ్ళు ఉంటాయి.

పగటిపూట ఇవి బండల చాటునా, గుహలలో నిద్రపోతూ గడుపుతాయి. తేనె వీటికి ఇష్టమైన ఆహారం. చెట్ల మీద ముంత కనిపిస్తే, చెట్లను ఎక్కి కల్లు తాగేస్తుంది. కల్లు తాగిన ఎలుగుబంటి చేసే చేష్టలు తమాషాగా ఉంటాయి.

వీటి కంటి చూపూ, వినికిడి శక్తి అంతంత మాత్రమే. అయితే, ఘ్రాణశక్తి మాత్రం చాలా గొప్పది. దూరం నుంచే వాసన ద్వారా మనుషుల రాకను పసికడుతుంది.

హిమాలయాలలోని ఊదా ఎలుగుబంట్లకూ, నల్ల ఎలుగుబంట్లకూ, దీనికీ దగ్గరి సంబంధం ఉన్నది.

# ఆధునిక భారతీయ చిత్రకారులు

## నందలాల్ బోస్

ఆధునిక చిత్రకళను గురించి ఆలోచిస్తున్నప్పుడు మనకు నందలాల్ బోస్ గీసిన అద్భుతమైన చిత్రాలు గుర్తుకువస్తాయి. నవీన కల్పనాశక్తితో, ఆదర్శ ఉపాధ్యాయుడుగా మరెందరో ప్రతిభావంతులయిన చిత్రకారులకు ప్రేరణ కలిగించి, వారిని తీర్చిదిద్దిన ప్రతిభామూర్తి నందలాల్ బోస్!



గత శతాబ్దాంతంలో జన్మించిన నందలాల్ బోస్, తన ప్రతిభతో – కలకత్తాలో చిత్రకళా పాఠశాలను నెలకొల్పి వర్ధమాన కళాకారులకు శిక్షణనిస్తున్న అవనీంద్రనాథ టాగూర్ దృష్టిని ఆకర్షించాడు. అవనీంద్రనాథ టాగూర్, నందలాల్ బోస్‌ను తనకు తగిన శిష్యుడని అతన్ని చేరదీసి ప్రోత్సహించాడు.

రవీంద్రనాథ టాగూర్ స్థాపించిన ఆదర్శ విద్యానిలయమైన 'శాంతినికేతన్'లో నందలాల్ బోస్ 1914వ సం॥లో చేరాడు. అటుతరవాత అక్కడి చిత్రకళా విభాగమైన 'కళా భవన్' బాధ్యతలను చేపట్టి, దాని అభివృద్ధికి అంకితభావంతో తన శాయశక్తులా కృషి చేశాడు.

విద్యార్థులూ, వర్ధమాన కళాకారులూ ఆయన చిత్రాలను చూసి ప్రేరణ పొందేవారు. ఆయన చిత్రాలలో భారతీయ మేధస్సు సరికొత్త విధానంలో రూపుదిద్దుకుంటుందని విమర్శకులూ, అభిమానులూ ఆనందించే వారు. చిత్రకారులు కావాలనుకునేవారికి నిశిత ప్రకృతి పరిశీలన, సంప్రదాయ అవగాహన, తమకంటూ ఒక ప్రత్యేకమైన పద్ధతి అవసరమని నందలాల్ బోధించే వాడు. ఆయన చిత్రాలలో ఈ మూడూ స్పష్టంగా కనిపించేవి. ఆయన గీసిన చెట్లూ, చేమా; పువ్వులూ, తీగలూ; జంతువులూ, పక్షులూ మొదలైన చిత్రాలను పరిశీలించినట్టయితే వాటిలోని విశిష్టత తెలియవస్తుంది.

భారతీయ సంప్రదాయ చిత్రకళారీతులను, కళాదృష్టితో పరిశీలించి, వాటిని మరింత ఆకర్షణీయంగా చిత్రించడంలో నందలాల్ బోస్ అందెవేసిన చేయి. దీనికి ఉదాహరణగా ఆయన గీసిన అజంతా చిత్రాలను చెప్పవచ్చు.



ప్రకృతి దృశ్యాలనూ, సంప్రదాయచిత్రాలనూ, తన నవీన కల్పనా శక్తితో అద్భుతంగా పునః సృష్టిచేసిన చిత్రకారుడాయన. ఆయనకు కళ కేవలం జీవనోపాధికాదు. ఆయన దానినొక 'యోగసాధన'గా భావించాడు. ఆయన తాను గీస్తున్న చిత్రాలలో లీనమైపోయేవాడు!

ఆయన తన జీవితకాలంలో ఎన్నో సత్కారాలనూ, బహుమతులనూ అందుకున్నాడు. అయినా, వాటిని చూసి ఆయన పొంగిపోలేదు. నిరాడంబరంగా జీవిస్తూ, కళకు తన యావజ్జీవితాన్ని అర్పించాడు. మన సమకాలీనచిత్రకళాకారులనుఎంతో ప్రభావితం చేసిన నందలాల్ బోస్ 1966వ సం॥లో కీర్తిశేషుడయ్యాడు.

# మీకు తెలుసా?

1. ఇంగ్లీషు భాషలో మొట్టమొదట పిల్లలకని రాసిన నాటకం ఏది? రచయిత ఎవరు?
2. కర్ణాటకలో ప్రసిద్ధి గాంచిన లోహపాత్రలు ఏవి?
3. సర్ రోజర్ బానిస్టర్ క్రీడారంగంలో ప్రముఖ స్థానం వహిస్తున్నాడు. ఎందుకో తెలుసా?
4. 'చార్మినార్' ఎక్కడ ఉన్నది?
5. ఒక 'క్వయిర్'కు ఎన్ని కాగితాలు? ఒక 'రీమ్'కు ఎన్ని క్వయిర్లు?
6. మనకు స్వాతంత్ర్యం రావడానికి ముందు లండన్‌లో జరిగిన మూడు రౌండ్ టేబుల్ సమావేశాలలోనూ పాల్గొన్న ఇద్దరు భారతీయ నాయకులు ఎవరు?
7. సూక్ష్మక్రిముల ద్వారా వ్యాధులు వస్తాయని కనుగొన్న వారెవరు?
8. మనదేశం నుంచి వదిలిన మొట్టమొదటి 'మిసైల్' ఏది?
9. మనకు 'ఆర్థిక సంవత్సరం' ఏప్రిల్ 1వ తేదీ ఆరంభమవుతుంది. ఇంగ్లాండులో ఎప్పుడు ఆరంభమవుతుంది?
10. టీవీ సీరియల్ 'మాల్గుడి డేస్' ఒక సుప్రసిద్ధ నవల ఆధారంగా రూపొందించబడింది. ఏ నవల? రచయిత ఎవరు?
11. 'కివీ' పక్షులు ఏదేశంలో ఉన్నాయి?
12. 'మయూర సింహాసనం' ఎవరికోసం తయారు చేశారు?
13. నాలుగు రకాల స్వాతంత్ర్యాలు ఏవి?
14. 1885వ సం॥లో బొంబాయిలో సమావేశమైన భారత జాతీయ కాంగ్రెస్ ప్రథమ మహాసభకు అధ్యక్షత వహించిన వారెవరు?

## సమాధానాలు

1. పీటర్ పాన్ (1904). సర్ జేమ్స్ బ్యారీ.
2. బిదార్‌లో తయారయ్యే బిద్రీపాత్రలు
3. 1954, మే 6వ తేదీ ప్రప్రథమంగా మైలు దూరాన్ని నాలుగు నిమిషాలలోపుగా పరిగెత్తాడు.
4. హైదరాబాదులో.
5. 24 కాగితాలు ఒక క్వయర్. 20 క్వయర్‌లు ఒక రీమ్.
6. తేజ్ బహదూర్ సప్రూ; ఎమ్.ఆర్. జయకర్.
7. ఫ్రెంచి రసాయనిక శాస్త్రజ్ఞుడు లూయీ పాశ్చర్.
8. పృథ్వీ.
9. ఏప్రిల్ 6.
10. 'స్వామి అండ్ హిస్ ఫ్రెండ్స్.' ఆర్.కె. నారాయణ్.
11. న్యూజీలాండ్.
12. మొగలు చక్రవర్తి షాజహాన్ కోసం.
13. వాక్ స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యం, భయం నుంచి విముక్తి.
14. డబ్ల్యు.సి. బెనర్జీ.



# బ్రతకనేర్చిన శత్రువులు

విశాలపురం గ్రామానికి పెద్దలిద్దరున్నారు. వారిలో వ్యవసాయదారుడు భూషయ్యకు అంగబలం, కండబలం వుంటే వ్యాపారి రోశయ్యకు ధనబలం, అధికారబలం వున్నాయి. ఇద్దరూ ఒకరికి మించి ఒకరు తెలివైనవారు. ఇద్దరికీ ఒకరంటే ఒకరికి పడదు.

బలవంతులతో విరోధం కూడదని విశాలపుర గ్రామస్థులందరూ వీరిద్దరితోనూ మంచిగానూ, వినయంగానూ వుంటూంటారు. భూషయ్యకూ, రోశయ్యకూ ఆ పద్ధతి నచ్చడం లేదు. ఊరంతా తన చెప్పుచేతల్లో మాత్రమే వుండాలని ఎవడికి మటుకు వాడే అనుకుంటున్నాడు.

ఇకపోతే, రమణయ్య అనే ఆయన పేరుకు మాత్రం విశాలపురం గ్రామాధికారి. ముఖ్యమైన నిర్ణయం ఏం తీసుకోవాలన్నా ఆయన భూషయ్యనూ, రోశయ్యనూ సంప్రదిస్తాడు. ఇద్దరిలో ఏ ఒక్కరికిష్టం లేకపోయినా, ఆయన ఏ కార్యమూ తలపెట్టడు. భూషయ్యకిష్టం లేని పని తలపెడితే వస్తాదులడ్డుపడతారు. రోశయ్య కిష్టంలేని పని తలపెడితే పైఅధికారులు తప్పు పడతారు.

ఇలా వుండగా – వ్యవసాయంలో కొత్త పద్ధతులు వచ్చాయి. పంటలకు ఎరువులు వాడితే రెట్టింపుకు పైగా దిగుబడి పెరుగుతుందని, ఆదేశపు రాజు అన్ని గ్రామాలకూ ఎరువులు సరఫరా చేయించాలనుకున్నాడు. అయితే, రైతులు ఎరువులకు కొంత మూల్యం చెల్లించాల్సివుంటుంది. ఇందువల్ల ఎరువుల సరఫరా వర్తకుల ద్వారా జరిపించాలనుకున్నాడు రాజు. ఈ విషయమై ఆయన అన్ని గ్రామాల అధికారుల్నీ పిలిచి సంప్రదించాడు. వారిలో రమణయ్య ఒక్కడే ఈ విషయం ముందుగా తన గ్రామస్థులతో చర్చించాలన్నాడు.

రాజు ఆశ్చర్యపడి, "గ్రామం బాగు కోసం నేను తలపెట్టిన ఈ పనికి, మళ్ళీ వేరే గ్రామస్థులతో చర్చలెందుకు?" అన్నాడు.

"వసుంధర"



"ప్రభూ! మా ఊళ్ళో రోశయ్యకు తెలియకుండా మరొకరు వ్యాపారం చేయలేరు. కాబట్టి తమరు ఎరువులను రోశయ్య ద్వారా అమ్మించాలి. వ్యవసాయదారు భూషయ్య చెప్పనిదే ఎవరూ వాటిని కొనరు. భూషయ్యకూ, రోశయ్యకూ ఏ మాత్రమూ సరి పడదు. వీరిద్దరికీ నచ్చచెప్పనిదే ఎరువులు మా గ్రామం ప్రవేశించడం సాధ్యపడదు," అన్నాడు రమణయ్య.

ఈ మాటలకు రాజు మరింత ఆశ్చర్యపడి, "ఆ భూషయ్య, రోశయ్యలు రాజాజ్ఞను కూడా ధిక్కరిస్తారా?" అని ప్రశ్నించాడు.

"అలాచేస్తేఎప్పుడోవాళ్ళను ఖైదు చేయించేవాడిని, ప్రభూ! ఇద్దరికిద్దరూ చాలా తెలివైన వాళ్ళు. వాళ్ళ గొడవలేవో వాళ్ళవి. నేరం మాత్రం చేయరు," అన్నాడు రమణయ్య.

ఈ వ్యవహారం పట్ల రాజుకు కుతూహలం పెరిగింది. ఆయన తక్కిన గ్రామాధికారులందర్నీ పంపించేసి, రమణయ్య నొక్కడినీ వుండమన్నాడు. ఈలోగా అక్కడికి మంత్రి వచ్చి, "మహారాజా! చారులు చెబుతున్నదాని ప్రకారం మన పొరుగు రాజు మాధవసేనుడు తెలివి తక్కువ విధానాలను అనుసరించి ప్రజల ఆగ్రహానికి గురయ్యాడు. సైనికులలో కూడా తిరుగుబాటు వచ్చేలాగున్నది. ఆ రాజ్యం మీద దండెత్తడానికి మనకిదే మంచి సమయం," అని చెప్పాడు.

"మాధవసేనుడి విషయం అలా వుంచండి. మనకిటు తూర్పు పక్కన వున్న చంద్రగుప్తుడి సంగతేమిటి? ఆయన బలహీన పడ్డాడా? లేకుంటే, మనమిలా మాధవసేనుడి మీదికి సైన్యాన్ని తరలించగానే, ఆయన మన రాజధాని మీద దాడి చేసి ఆక్రమిస్తే ఏం చేయాలి?" అని అడిగాడు రాజు.

ఇందుకు మంత్రి, "మహారాజా! ఈ సమస్యా పరిష్కారమవుతుంది. మన విదూషకుడు ఇద్దరు దూతలకు ప్రత్యేక శిక్షణ ఇచ్చి, ఒకణ్ణి మాధవసేనుడి వద్దకూ, మరొకణ్ణి చంద్రగుప్తుడి వద్దకూ పంపాడు. వాళ్ళు అదును చూసి ఒకరి మీద ఒకరికి బాగా చాడీలు చెప్పి, వాళ్ళిద్దరి మధ్యా పరమశత్రుత్వాన్ని సృష్టిస్తున్నారు. తమరు మాధవసేనుణ్ణి ఓడిస్తే చంద్రగుప్తుడు

ఎంతో సంతోషించే పరిస్థితి ఏర్పడుతుంది," అన్నాడు.

రాజు మంత్రిని సెభాషని మెచ్చుకున్నాడు. అప్పుడు రమణయ్య కలగజేసుకుని, "ప్రభూ! తమ విదూషకుడు మహామేధావిలాగున్నాడు. విశాలపురంలో భూషయ్యకూ, రోశయ్యకూ మధ్య గొడవలు పెట్టి, ఇద్దరూ తగవులాడుకునేలా చేయడం ఆయన చేతనైతే, నా సమస్య కూడా పరిష్కారమై పోయినట్టే!" అన్నాడు.

రాజు వెంటనే విదూషకుడికి కబురు పంపి రప్పించాడు. విదూషకుడు, రమణయ్య సమస్య ఏమిటో విని, "గ్రామంలో భూషయ్య, రోశయ్యల వంటి పెద్దలుండగా నువ్వు గ్రామాధికారివెలా అయ్యావు? గ్రామమంతా వాళ్ళ అదుపులో వున్నప్పుడు, తామే గ్రామాధికారి కావాలని వాళ్ళెందుకనుకోలేదు?" అని అడిగాడు.

"ఇద్దరిదీ సమాన బలం. ఒకరితో ఒకరు తలపడితే ఇద్దరికీ నష్టమేనని వాళ్ళకు తెలుసు. ఇద్దరిలో ఎవరు గ్రామాధికారి అయినా రెండో వాడుసహించడు.అప్పుడు గ్రామాధికారి అయినవాడి బ్రతుకు దినదిన గండమవుతుంది. అది తెలిసే వాళ్ళు మూడో మనిషిని గ్రామాధికారిని కానిచ్చారు," అన్నాడు రమణయ్య.

"వర్తకుడూ, వ్యవసాయదారుడూ ఒకరి మీద ఒకరు ఆధారపడకుండా ఒకే గ్రామంలో ఎలా వుండగలుగుతున్నారు?" అన్నాడు విదూషకుడు.

"భూషయ్య తనకవసరమైన వస్తువులన్నీ ఇతరుల చేత రోశయ్య వద్ద కొనిపించి తీసు





కుంటాడు. రోశయ్యా అంతే! ఎట్టి పరిస్థితు ల్లోనూ ఒకరికొకరు ఎదురుపడరు; మాట్లాడు కోరు," అని జవాబిచ్చాడు రమణయ్య.

"వీళ్ళు బ్రతకనేర్చినశత్రువుల్లావున్నారు! ఇలాంటి వాళ్ళను చాడీలతోటే లొంగదీయాలి. అందుకు నేను మెరికల్లాంటి ఇద్దరు మనుష లను పంపుతాను," అన్నాడు విదూషకుడు.

వెంటనే రమణయ్య, రాజుతో, "ప్రభూ! విదూషకుడి మనుషులు మా గ్రామంలో విజయం సాధించే వరకూ తమరు దండ యాత్ర విషయం వాయిదా వేయవలసిందిగా కోరుతున్నాను," అన్నాడు.

దీనికి రాజు ఆశ్చర్యపడినా, ఎందుకని అడక్కుండా సరేనన్నాడు.

ఆ తర్వాత విదూషకుడు పంపగా శంక రుడనే వాడు భూషయ్య వద్దకూ, గోపాలుడనే వాడు రోశయ్య వద్దకూ చేరుకున్నారు. ఇద్దరూ కూడా చాడీలు చెప్పడంలో చాలా నేర్పరులు. రోజూ వాళ్ళు భూషయ్య మీద రోశయ్యకూ, రోశయ్య మీద భూషయ్యకూ లేనిపోనివన్నీ కల్పించి చెబుతూండేవారు. అందుకా పెద్దలి ద్దరూ ఆవేశపడినట్లే కనబడినా, ఒకరితో ఒకరు గొడవలు మాత్రం పెట్టుకోలేదు.

అలా నెల రోజులు గడిచాక శంకరుడు, గోపాలుడు చాటుగా కలుసుకుని, "ఈ పెద్దలు మన మాటలను పూర్తిగా నమ్మినట్టు కన బడదు. ఇక నుంచి మనం జాగ్రత్తగా పథకం వేసుకుని, మనం చెప్పిందానికి సాక్ష్యాలు కూడా సృష్టిద్దాం," అనుకున్నారు.

ఆ ప్రకారం శంకరుడొకసారి భూషయ్యతో, "మీ పశుసంపద చూసి రోశయ్యకు కన్ను కుడుతున్నది. ఆయన వాటికి విషప్రయోగం చేయాలనుకుంటున్నాడు," అన్నాడు.

ఆ తర్వాత శంకరుడు నియమించిన మనిషి పశువుల కుడితిలో విషం కలపబోతూ పట్టుబడ్డాడు. భూషయ్యవాడిని గట్టిగా గద మాయిస్తే, తనను రోశయ్య పంపినట్లు చెప్పాడు.

అదేసమయంలో గోపాలుడు నియమిం చిన మనిషి, రోశయ్యఇంట దొంగతనం చేయ బోతూ పట్టుబడ్డాడు. వాడు రోశయ్యకు తనను భూషయ్య పంపాడని చెప్పాడు.

విచిత్రమేమంటే – భూషయ్య, రోశయ్య నేరస్థులను గ్రామాధికారికి అప్పజెప్పారే తప్ప ఒకరి మీద ఒకరు ఫిర్యాదు చేసుకోలేదు. నేరస్థులు నోటికి వచ్చినట్టు చెబుతారనీ వారి మాటలకు విలువనివ్వకూడదనీ, ఇద్దరూ చెప్పి – నేరస్థులను నేరానికి తగిన విధంగా శిక్షించమన్నారు.

తర్వాత భూషయ్య, శంకరుడిని పిలిచి, "నువ్వు ఉత్తపుణ్యాన రోశయ్య మీద చాడీలు చెబుతున్నావని, నాకు అనుమానంగా వుంది. ఇంతవరకూ నువ్వు రోశయ్య గురించి చెప్పిన వన్నీ అబద్ధాలే! వారం రోజుల్లో ఆయన్ను గురించి ఒక్క నిజం చెప్పావా, సరేసరి! లేదా నా పశువులకు విషం పెట్టమన్నది నువ్వే నని గ్రామాధికారికి చెబుతాను," అన్నాడు.

రోశయ్యకూడా గోపాలుడిని ఇదే విధంగా బెదిరించాడు.

ఇది జరిగాక శంకరుడు, గోపాలుడు చాటుగా కలుసుకుని, "ఎంతో చాకచక్యంగా మనం అల్లిన అబద్ధాలు వీళ్ళ మీద పని చెయ్యలేదు. ఈ వారం రోజుల్లోనూ ఏదో ఒక నిజం తెలుసుకోకపోతే మన బండారం బయట పడి, రాజుగారికి చెడ్డపేరువస్తుంది. కాబట్టి గట్టిగా ప్రయత్నించాలి," అనుకున్నారు.

ఈ లోగా ఎరువుల కబురు గ్రామాధికారి ద్వారా విడివిడిగా భూషయ్యకూ, రోశయ్యకూ చేరింది. ఎరువులు నేరుగా రైతులకే ఇవ్వాలనీ, వర్తకులనుంచి తాను తీసుకోననీ భూషయ్య స్పష్టంగా చెప్పాడు. ఎరువులు తనే అమ్ముతా ననీ, ఎవరిక్కావాలన్నా నేరుగా తన నుంచే





కొనుక్కోవాలనీ రోశయ్య అన్నాడు. గ్రామస్థు లందరూ చివరికేం జరుగుతుందో అని కుతూహలంగా ఎదురు చూడసాగారు.

ఈ పరిస్థితుల్లో శంకరుడొక విషయం తెలుసుకున్నాడు. గ్రామాధికారి, రాజుకు తనూ, భూషయ్యా అన్నదేమిటో చెప్పేలోపల రోశయ్య తన మనిషి నొకణ్ణి రాజు దగ్గిరకు పంపాలను కున్నాడు. ఆమనిషిరాజుతో, రోశయ్య మాటగా, "ఎరువులు రైతులకు చాలా అవసరంగదా. వాటిని రాజే నేరుగా రైతులకు ఇస్తే బాగుంటుంది. మధ్య వర్తకులు దేనికి?" అని చెప్పాలి.

వర్తకుడైన తనే ఇలాంటి సూచన చేయడంవల్ల, రాజుకు తనపై సదభిప్రాయం ఏర్పడుతుందని రోశయ్య ఆలోచించాడు.

ఈ వార్తను శంకరుడు, భూషయ్యకు చేరవేశాడు. ఆయన వాణ్ణి మెచ్చుకుని, "నాకు పయోగించే కబురు తెచ్చావు. ఒక వర్తకుడే అలాంటి కబురు చేస్తే, రాజు తప్పక ఒప్పుకుంటాడు. గ్రామంలో వున్న రైతులెవరూ నా మాటకు ఎదురాడ లేరు గనక, మొత్తం ఎరువు నా దగ్గరకే చేరుతుంది. ఆ ఎరువును మిగతా రైతులకు అమ్మడం ద్వారా, వర్తకంలోని సాధకబాధకాలు తెలుసుకుంటాను. ఇంతకాలం నేను పండించినది అమ్మడమే తప్ప, ఏదీ కొని అమ్మలేదు. ఈ అనుభవంతో నేనూ వ్యాపారం మొదలు పెడతాను. వ్యాపారి రైతు కాలేడు కానీ, రైతు వ్యాపారి కావడం కష్టం కాదు," అన్నాడు.

ఈ సంగతి గోపాలుడిద్వారా రోశయ్యకు చేరింది. ఆయన వాణ్ణి మెచ్చుకుని, "నువ్వీ కబురు తేవడం మంచిదే అయింది. లేకుంటే నేను రాజు దగ్గరకు నా మనిషిని పంపి కొరివితో తలగోక్కునే వాణ్ణి," అన్నాడు.

ఆ తర్వాత గ్రామాధికారి, శంకరుడు, గోపాలుడు రాజధానికి వెళ్ళి రాజు, మంత్రి, విదూషకులను కలుసుకుని జరిగిందంతా చెప్పారు.

"అయితే నేనిప్పుడేం చేయాలి?" అని అడిగాడు రాజు.

ఇందుకు గ్రామాధికారి రమణయ్య, రాజుతో, "ప్రభూ! రాజాజ్ఞగా ఎరువులను అమ్మాలని రోశయ్యకు చెప్పండి. భూషయ్య తన పొలా

న్నెవరో కమతగాడికిచ్చానని, వాడిచేత ఎరువులు కొనిపించుకుంటాడు. తమకు తాముగా ఒప్పుకోరుతప్ప, రాజాజ్ఞను వాళ్ళు ధిక్కరించరని నాకు తెలుసు!" అన్నాడు.

"ఇలాంటి వాళ్ళు కలిసివుంటే ఎంతో బాగుండేది!" అన్నాడు రాజు నిట్టూర్చి.

అప్పుడు శంకరుడు, గోపాలుడు విదూషకుడితో, "మాకొక్కటే ఆశ్చర్యంగా వుంది. మేమెన్ని కల్పించి చెప్పినా వాళ్ళిద్దరికీ తెలిసిపోయేది. ఒకే ఒక్కసారి నిజం చెబితే, అది నిజమని కూడా వాళ్ళు గ్రహించారు.. వాళ్ళ వద్ద నిజం తెలుసుకునే మహిమ ఏదో వుండే వుండాలి," అన్నారు.

విదూషకుడు నవ్వి, "ఇప్పుడంతా నా కర్థమయింది. ఇందులో ఏమహిమా లేదు. భూషయ్యకూ, రోశయ్యకూ కూడా ఒకరి తెలివిపై ఒకరికి అపారమైన గౌరవముంది. శత్రువు తెలివి తమ ఊహకందదని వారికి తెలుసు. ఊహకందే సామాన్య విషయాలు చాడీలుగా చెబితే వారు నమ్మలేదు. తమ ఊహకందని విశేషాల్నే వాళ్ళు నమ్మారు! వాళ్ళు నిజంగా బ్రతక నేర్చిన శత్రువులు. ఇలాంటి వాళ్ళ శత్రుత్వం వాళ్ళకూ, ఇరుగు పొరుగులకూ కూడా మేలే చేస్తుంది," అన్నాడు.

ఇది వింటూనే రాజు ఉలిక్కిపడి, "అలాంటప్పుడు మన ఊహకందే విశేషాలు తెచ్చిన చారుల మాటలు నమ్మి, రాజు మాధవసేనుడి మీద దండెత్తాలనుకునే మనం మూర్ఖులకిందే లెక్క! పొరుగు రాజ్యాలతో మనమూ బ్రతక నేర్చిన శత్రువులలాగే వుండాలని రమణయ్య అభిప్రాయమనుకుంటాను. అందుకే ఆయన నా దండయాత్రను వాయిదా వేయమన్నాడు. అవునా?" అని గ్రామాధికారి రమణయ్య నడిగాడు.

దానికి రమణయ్య వినయంగా, "ప్రభూ! బ్రతకనేర్చిన శత్రువుల మధ్య అధికారిగా వుంటూ మందబుద్ధినైన నేనే తెలివి తెచ్చుకున్నాను. సూక్ష్మగ్రాహులైన ప్రభువుల మాట కాదంటానా?" అన్నాడు.

భూషయ్య, రోశయ్యల శత్రుత్వం ధర్మమా అని, ఆ దేశపు రాజు శత్రువుల మధ్య సుఖ శాంతులతో కలకాలం రాజ్యం చేశాడు.



# ఈదటం తెలియని కప్పలు!

రాఘవపురంలో ఒక రైతు, ఒక వడ్డీవ్యాపారి వద్ద వ్యవసాయప్పనుల ఖర్చులకు గాను కొంత డబ్బు తీసుకున్నాడు. కొన్నేళ్ళుగా ఆ అప్పు తీర్చక పోగా, అవసరాలకు గాను రైతు మరికొంత డబ్బు తీసుకోవడంతో, అసలూ, వడ్డీలు కలిసి పెరిగిపోయిన బాకీని తీర్చలేకపోయాడు. వడ్డీవ్యాపారి, రైతు పొలాన్ని స్వాధీనం చేసుకున్నాడు. రైతుకు ఆ ఊరిపెద్ద సాయపడలేదు. రైతు వెళ్ళి రాజుతో మొరపెట్టుకున్నాడు. రాజు వడ్డీవ్యాపారిని కూడా పిలిపించి విచారణ ప్రారంభించాడు.

"వడ్డీవ్యాపారి దగ్గిర తీసుకున్న డబ్బు,తిరిగి ఇవ్వాలని తెలియదా?" అని రాజు, రైతును ప్రశ్నించాడు.

"తెలిసి మాత్రం లాభమేమిటి, ప్రభూ! కప్పలకు ఈదటం తెలియదా? కాని, మా ఊళ్ళో కప్పలకు ఐదేళ్ళు వచ్చినా ఇంకా ఈదటం తెలియదు. దీన్ని తెలుసుననాలో, తెలియదనాలో తెలియదు!" అన్నాడు రైతు.

"రామాయణంలో పిడకలవేటలా, ఈ కప్పలఈత ఏమిటి మధ్యలో?" అన్నాడు అక్కడే వున్న మంత్రి.

దీనికి రాజు నవ్వి, మంత్రితో, "ఈ రైతు అప్పు తీర్చి, ఇతని కుటుంబానికి కావలసిన సహాయం చెయ్యండి," అన్నాడు. వడ్డీ వ్యాపారికి రైతు చేసిన అప్పు చెల్లించ బడింది.

రాజు, రైతుతో, "మీ ఊరి కప్పలు ఈత నేర్చాక, మేము వడ్డీ వ్యాపారికి ఇచ్చిన డబ్బు నువ్వు ప్రభుత్వ ఖజానాలో చెల్లించు," అని చెప్పి రైతును పంపించి వేశాడు.

తర్వాత రాజు, అయోమయంగా చూస్తున్న మంత్రితో, "ఐదేళ్ళుగా తమ ప్రాంతాల వర్షాలు లేవనీ, పంటలు పండలేదనీ చెప్పేందుకు రైతు, ఈదడం తెలియని కప్పల సంగతి సూచించాడు," అన్నాడు.

—సుంకర భాస్కరరావు






హనుమంతుడు అయోధ్యను చేరే దారిలో ఉన్న వాల్మీకి ఆశ్రమంలో దిగి, వాల్మీకి మహామునికి నమస్కరించి, "మహానుభావా! రాముడికి ఎందుకిలా జరిగింది?" అని అడిగాడు.

వాల్మీకి చిరునవ్వు నవ్వి, "హనుమంతా! రాజ్యపాలన ఎంత కఠోరమైనదో, శంబుకుడిలాంటి పరమసాధువైన నిరపరాధులు అధిక వర్గాల వారి ప్రాబల్యం వల్ల ఎలా బలి అవుతుంటారో అనే కాక, కానిపని అని తెలిసి కూడా పాలకుడు పాపం మూట గట్టుకోవలసి ఉంటుందనీ, మాయావులయిన పాపిష్టినోళ్ళనుంచి వెలువడిన విషబీజాలు పామర ప్రజల్లో చెలరేగకుండా ఉండడానికి పాలకులు ఎలాంటి త్యాగాలు చేయవలసి ఉంటుందో నిరూపణకావడానికే, ఇలా జరిగిందని నీకు తెలుసు. నేను వేరే ప్రత్యేకంగా చెప్పాలా?" అని అన్నాడు.

హనుమంతుడు వాల్మీకి ఆశ్రమంలో సీత ఉండిన కుటీరాన్నీ, లవకుశులు చెట్ల బోదెలపై బాణాలతో పెట్టిన గుర్తుల్నీ తనివి తీరా చూశాడు. సీత సంచరించిన నేలను ఒక్కసారి భక్తితో కళ్ళకద్దుకొని అయోధ్యకు ఎగిరాడు.

హనుమంతుడు ఎగురుతూ వెళ్ళి అయోధ్యను చేరి రాజభవనం ముందు ఉద్యాన వనంలో వాలాడు.

అక్కడ కుశలవులు విలువిద్యలతో వినోదిస్తున్నారు. వాళ్ళిదద్దరి మధ్యా బాణాలతో అందమైన ఒంటిస్తంభం మేడ ఎత్తుగా లేచి



మాయలమారివి. నువ్వు మారీచుడికేమవుతావు?" అంటూ లవుడు బాణం ఎక్కుపెట్టాడు.

లవుణ్ణి శాంతపరుస్తూ, రాముడిలాగ శాంతంగా కుశుడు, "నువ్వు హనుమంతుడివేనని నిరూపించుకుంటేనే గాని నిన్ను కదలనివ్వము!" అన్నాడు.

"నీ ప్రతాపాలన్నీ చూపించు! మొదట నీ ప్రబల రూపం మాకు చూపించు!" అన్నాడు లవుడు.

హనుమంతుడు పెరిగి వారినిద్దరినీ ఆలింగనం చేసుకున్నాడు. వారిని తన వీపు మీద కూర్చుండబెట్టుకొని ఆకాశానికెగిరి సరయూనది మీదుగా అయోధ్యానగరం చుట్టూరా గిరగిరా తిప్పాడు. ఆకాశం ఎత్తున పెరిగి సీతకు చూపిన విశ్వరూపాన్ని చూపించాడు. తోకను పెంచి గిరగిరా తిప్పి, చుట్ట చుట్టి కోట కట్టాడు. లవకుశులను భుజాల మీద ఎక్కించుకొని, "మైరావణ సంహారంలో రామలక్ష్మణులను ఇలాగే మోశాను," అంటూ కోట గోడల మీద చుట్టూరా సంతోషంగా తిప్పి వచ్చాడు.

ఉంది. లవకుశులు హనుమంతుడిని చూసి, ఒకరి కొకరు కనుసైగలు చేసుకొని, ఇద్దరూ హనుమంతుడి చుట్టూరా బాణాలు కొట్టి కంచె నాటారు.

"మాయావీ! ఎవరు నువ్వు?" అని గద్దించాడు లవుడు.

లవుడిలో సీత పోలికలు ఎక్కువగా ఉన్నవి. కుశుడు రాముడిని పోలి ఉన్నాడు. సీతారాములలాగ కనిపిస్తున్న లవకుశులను హనుమంతుడు కళ్ళవిందుగా చూస్తూ, "నేను హనుమంతుడిని! రాముడిని కలుసుకోవాలి!" అన్నాడు.

"నిన్ను నమ్మేది లేదు, గదా గిదా పట్టుకొని హనుమంతుడివేషం వేసుకువచ్చిన

లవకుశులు హనుమంతుడికి నమస్కరించి, "హనుమంతుడా! నీ ప్రతాపాల్ని కళ్ళారా చూడాలని నిన్ను ఆటాడించాము. అంతేగాని మరొక ఉద్దేశం లేదు. మమ్మల్ని మన్నించు!" అని ముసిముసిగా నవ్వుతూ క్షమాపణ చెప్పుకున్నారు.

"మీ కోరిక తీర్చడానికే నేనూ మిమ్మల్ని ఆడించాను మరి!" అన్నాడు హనుమంతుడు నవ్వుతూ.

లవకుశులు చెరోపక్కా హనుమంతుడి చేతులు పట్టుకొని రాముడి దగ్గరకు నడిపించారు.

రాముడు హనుమంతుడిని చూస్తూనే దుఃఖాతిశయం వల్ల మాటాడక కన్నీరు పెట్టుకున్నాడు. హనుమంతుడు రాముడి ముందు మోకరిల్లి, "నువ్వు, పామరుడి లాగ దుఃఖానికి వశమైతే ఎలాగ? రాజ్య పాలన సుఖభోగాల పూలశయ్య కాదనీ, ఎలాంటి పనినైనా చేయవలసి ఉంటుందనీ, ఎంతటి త్యాగాన్నయినా చేయక తప్పదనీ ముమ్ముందు కాలాల్లో కూడా రామరాజ్యాన్ని ఉదాహరణగా చెప్పుకోవడం కోసమే ఇలా జరిగింది కదా! నువ్వేది చేసినా అందులో ఏదో పరమార్థం ఉంటుంది. అర్థం చేసుకో గల వాళ్ళకే అది అర్థమౌతుంది!" అని ఊరడించాడు.

అప్పుడు రాముడు పెద్దగా నిట్టూర్చి, "హనుమా! నిన్ను చూసి, నీ మాటలు విని ఇప్పుడు నా మనస్సు కొంత తేరుకుంటున్నది. సీతలేని బెంగకు తోడు ఒకవేళ ఈ అశ్వమేధ యాగం విఫలమైతే నీ రాముడు నీకు దక్కడు! యాగాశ్వం ఇప్పుడు మణిపురం దిశగా వెళ్తూన్నట్టు తెలిసింది. అశ్వరక్షణ భారం నీ భుజస్కంధాల మీద కూడా మోపు



తున్నాను. అందుకే నిన్ను ఇప్పుడు పిలిపించాను. అశ్వం వెంట నా ముగ్గురు తమ్ముళ్ళూ వెళుతున్నారు. నీవు వాళ్ళతో చేరు!" అని చెప్పాడు.

రాముడి ఆజ్ఞను శిరసావహించి హనుమంతుడు గదను భుజాన వేసుకొని రివ్వున ఆకాశానికి ఎగిరాడు.

హనుమంతుడు ఆకాశమార్గాన పోతూండగా, ఒక కీకారణ్యంలో ఒక రాక్షసి, ఒక రాక్షసుడు విజయనాదాలు చేస్తూ తప్ప తాగి తందనాలాడుతూ కనిపించారు. అనుమానం వేసి హనుమంతుడు సూక్ష్మరూపంతో వాళ్ళకు సమీపంలో ఉన్న ఒక చెట్టు మీద వాలి పొంచి ఉన్నాడు. వాళ్ళు ఆడడం చాలించి



కరాళకంఠుడు శతకంఠ రావణుడి తమ్ముడు. యుద్ధంలో చావు తప్పించుకొని పారిపోయి తన అన్న శతకంఠరావణుడిని చంపిన సీత మీదా, రాముడి మీదా పగ సాధించడానికి రజకుడి రూపంతో అయోధ్య చేరాడు. రావణాసురుడి చెల్లెలు శూర్పణఖ కూడా ఇంకా బ్రతికే ఉంది. కాకతాళీయంగా అది కూడా పగ సాధించడానికే రజకస్త్రీ రూపంతో అయోధ్య చేరింది. వాళ్ళిద్దరూ చాలా చిత్రంగా అనుకోకుండా ఒకచోట కలుసుకున్నారు.

ఇద్దరూ ఆకలితో, మనిషి దొరికితే తిందామని ఊరు పొలిమేరల్లో తిరుగుతూ ఒకరికొకరు మానవరూపాల్లోనే తారసపడ్డారు. శూర్పణఖ వయ్యారాలొలికిస్తూ క్రీగంటి చూపుతో కరాళుడిని లాక్కెళ్లింది. ఆడ మాంసమైనా, ఏదో ఒకటి తినక తప్పదు గదా అని ఆకలిగొన్న కరాళుడు ఆమె వెంట పడ్డాడు.

మనిషి దొరికాడు తిందామని శూర్పణఖ రాక్షసాకారం తాల్చి నోరావులించే సరికి, "నువ్వూ రాక్షసివేనా?" అంటూ కరాళుడూ రాక్షసుడై నిలిచాడు. వాళ్లిద్దరూ రజక దంపతులుగా కపట నాటకం ఆడి, పదుగురు వినేలాగా రాముణ్ణి నిందించి అయోధ్య నుంచి పారిపోయి అరణ్యాల్లో ఉంటున్నారు.

చెట్టుమీద ఉన్న హనుమంతుడు వాళ్ల మాటలు వింటున్నాడు!

చెట్టు కిందకు చేరి మాట్లాడుకుంటున్నారు. హనుమంతుడు వాళ్ళ మాటలను జాగ్రత్తగా విన్నాడు.

"శత్రుశేషం ఉండరాదని ఊరికే అన్నారా? శత్రుశేషంగా మిగిలిన మనం ఈనాటికి మన అన్నల ఋణం తీర్చుకున్నాం, కరాళకంఠుడా! ఆ రాత్రి రజకుడిగా నీ కరాళకంఠ స్వరంతో వీధి దద్దరిల్లే విధంగా ఎంత బాగా అరిచావు, ఓండ్రపెట్టావు!" అని రాక్షసి అన్నది.

"శూర్పణఖా! నీ వగల ఏడుపెంత బాగుందనుకున్నావు, దొంగవేషం వేసినా భలే బాగా వేశావు," అని రాక్షసుడు బదులు మెచ్చుకున్నాడు.

"అప్పుడు హనుమంతుడు లేకపోయాడు కాబట్టి సరిపోయింది గాని, అయోధ్యలోనే ఉంటే మనల్ని పసిగట్టి మరుక్షణమే మన అన్నల దగ్గరికి పంపేవాడు. మన అదృష్టం బాగుండబట్టే ఏదో పర్వతం మీద ఉండి పోయాడు ఆ వానరుడు!" అన్నాడు కరాళుడు సంతోషంగా.

"ఆ హనుమంతుడి ఊసెత్తకు, ఆ వానరుడంటే నాకు మా చెడ్డ కోపం!" అన్నది శూర్పణఖ.

"కోపం కాదు, గుండెదడ అను!" అన్నాడు రాక్షసుడు పళ్ళికిలిస్తూ.

"మా అన్న బంగారంతో నాకు కట్టిచ్చిన మేడ కాల్చిపారేశాడు గద, తోకగాడు! వాడంటే నాకు భయం గియం లేదు గాని, మా చెడ్డ ఒళ్లుమంట!" అంటూ శూర్పణఖ వీపు తడుముకుంది.

దాని వీపు మీద పెద్ద కాలిన మచ్చ ఉంది. అది లంకాదహనమప్పుడు మండుతున్న దూలం దాని వీపున పడినందున ఏర్పడిన మచ్చ. కరాళుడు దాన్ని చూసి హేళనగా, "అందుకా మంట అంటున్నావు! అది ఇంకా చురచురలాడుతోంది కాబోలు పాపం! మేడ కాలిపోయినా మచ్చ ఉంది పోన్లే!" అన్నాడు.

వాడి వేళాకోళానికి శూర్పణఖ ముఖం ముడుచుకొని, "చాల్లే, మహా చెప్పొచ్చావు!" అంది.



"అది కాదే శూర్పణీ! నాకూ వాడంటే మంటే, మంటన్నరాను! మా చెడ్డవాడు సుమీ!" అన్నాడు వాడు.

"అలాగ చెప్పు! మహావీరుడిలాగ మాటాడకు! వాడి బారి నుంచి పారిపోయావు. పిరికి వెధవా! యుద్ధంలో చచ్చావు కాదు వీరుడి లాగ!" అంది శూర్పణఖ ఎంతో కోపంగా.

"పారిపోబట్టే పగ తీర్చుకున్నాను. నీలాంటి అందాల రాక్షసి నాకు దొరికింది!" అన్నాడు వాడు.

"ఇహ మనం ఏ దూరతీరాలకో పోయి జీవితాలు సార్థకం చేసుకుందాం పద!" అంది శూర్పణఖ.



"మరొక్క పనిచేసి మరీ పోదాం. రాముడి యాగాశ్వాన్ని మనం పట్టుకోవాలి!" అన్నాడు కరాళుడు.

"భలే! దానిమీద సవారీ చేస్తూ పోదాం!" అంది శూర్పణఖ.

"సవారీకి కాదే వెర్రిమొగమా!" అన్నాడు వాడు.

"ఆఁ! ఏమని కూశావు? మళ్ళీ అలాగన్నావంటే జాగరత! నా గోళ్ళ పదును చూపిస్తా! ముక్కూ, చెవులూ కొంచెం మొద్దుబారాయి కానీ, నా మొఖానికేం? లక్ష్మణుడు కోసెయ్యక మునుపు మూరెడు ముక్కూ, బారెడు చెవులూ వుండేవి. అయినా ఇప్పుడే నా ముఖం చాలా అందంగా ఉందనుకో! అన్నట్లు, కామగమనం గల మనకు గుర్రం ఎందుకురా, కరాళా?" అంది శూర్పణఖ.

"దాన్ని మనం చంపెయ్యాలి!" అన్నాడు కరాళుడు.

"గుర్రం మీద మనకేం పగనీ?" అంది శూర్పణఖ.

"గుర్రం మీద కాదే శూర్పణఖా, మనకు రాముడి మీద పగ! గుర్రం కనిపించకపోతే రాముడి యాగం ధ్వంసం అవుతుంది. సీత లేక అర ప్రాణంతో ఉన్న రాముడు దాంతో తారుమంటాడు!" అని విడమరిచి చెప్పాడు సంతోషంగా కరాళుడు.

"అయితే త్వరగా చంపేద్దాం పద! గుర్రం తలమాంసం మాంచి రుచిగా కూడా ఉంటుందిలే!" అంది శూర్పణఖ.

"తిండిపోతూ! ఎంతసేపూ తిండి ధ్యాసే నీకు!" అంటూ కరాళుడు అక్కడి నుంచి లేచాడు.

హనుమంతుడు చెట్టు కొమ్మలు విరిచి వాళ్ళమీద వేశాడు.

"మనమీద పూలవాన కురిపిస్తున్నారా పెద్దలు!" అంది శూర్పణఖ.

"పూలవర్షం కాదే కామరూపిణీ! చెట్టు ఆకుల వర్షం!" అన్నాడు కరాళుడు పైకి చూస్తూ.

"ఏదో ఒకటి, పద వేగంగా గుర్రం పని పడదాం!" అంటూ శూర్పణఖ, కరాళుడి చేతులు పట్టుకున్నది.

ఇద్దరూ బయలుదేరబోతూండగా హనుమంతుడు తన తోకను పెంచి వాళ్ళ దారికడ్డంగా పంపాడు.

"సర్పం! మహాసర్పం!" అన్నాడు కరాళుడు.

శూర్పణఖ దానిని పరికించి, "పాము కాదు, కోతి తోక! యముడు మనమీదికి విసిరిన ఉరిత్రాడు! హనుమంతుడి తోక," అంది కెవ్వున అరుస్తూ.

"ఊరుకోవే! ఇక్కడేం హనుమంతుడే? ఏది చూసినా నీకు హనుమంతుడి భయం!" అన్నాడు కరాళుడు.

"నాకు బాగా గుర్తురా! లంక కాల్చిన ఆ తోక ఇదే!" అంది శూర్పణఖ భయంతో గజగజలాడుతూ.

శూర్పణఖ మాటలు వింటూనే కరాళుడు పారిపోబోతూంటే శూర్పణఖ, "నన్నొక్కదాన్నీ వదిలేసి పారిపోతావుట్రా!" అంటూ వాణ్ణి పట్టుకుంది.

చెట్టు దిగి హనుమంతుడు భీకరాకారంతో నిల్చున్నాడు. రాక్షస జంట కీచుకీచుమంటూ పారిపోతూంటే హనుమంతుడు పెద్ద గండశాలి పర్వతాన్ని పెకల్చి, వాళ్ళమీదకు విసిరాడు. దాని కింద పడి ఆ క్షణమే వాళ్ళు చచ్చారు.

ఆ విధంగా శత్రుశేష నిర్మూలన తన చేతుల మీద జరిగినందుకు సంతోషించి, హనుమంతుడు అడవి దద్దరిల్లేలా సింహనాదం చేసి, రివ్వున ఆకాశానికెగిరి మణిపురం దిశగా వెళ్ళాడు.

హనుమంతుడు ఆకాశంలో ఎగురుతూ, పాయలుగా చీలి, సుందరవనాల గుండా పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తున్న గంగానదిని దాటి, మణిపుర రాజ్య పరిసరాల్ని చేరాడు.

దూరంలో బ్రహ్మపుత్రా నది వెండి కరిగి పారుతున్నట్లు మిలమిల మెరుస్తూన్నది.

అంతలో మణిపుర రాజధాని పొలిమేరలో ఆకాశంలో ఒక మెరుపు మెరిసి, గొప్ప ధ్వనితో ఏదో రివ్వున దూసుకుని పోతున్నట్లు కనిపించింది. మరుక్షణమే హనుమంతుడు మెరుపును మించిన వేగంతో అటు ఎగురుతూ వెళ్ళాడు.





# దురాశాపరులు

తండ్రి పోయి ఏడాది తిరక్కుండానే, వ్యాపారంలో అనుభవం లేక కొండయ్య పూర్తిగా నష్టపోయి అప్పులపాలయ్యాడు. ఆ అప్పులు తీర్చేందుకు తాతల నాటి ఇల్లమ్మి, భార్యా ఇద్దరు పిల్లలతో వాడు భార్య కొండమ్మ పుట్టిన ఊరయిన అడవిమిట్ట చేరాడు. ఆ ఊళ్ళో ఏనాడో కొండమ్మ అవ్వ వదిలిపోయిన పెంకుటిల్లొకటున్నది.

దయ్యాలకొంపలా వున్న ఆ ఇంటిని భార్యాభర్తలిద్దరూ నాలుగు రోజులు కష్టపడి బాగుచేసుకున్నారు. ఇది జరిగాక, ఇప్పుడు కుటుంబపోషణకు ఏం చేయాలన్న సమస్య కొండయ్య కెదురైంది.

కొండమ్మలో తెలివుంది. దాన్ని మించిన గయ్యాళితనముంది. ఆమె దిగులుపడుతున్న భర్త వాలకం చూసి కోపంగా, "ఎందుకా దిగులు? పూలమ్మిన చోట కట్టెలమ్మలేకే గదా, ఇన్నామడల దూరం వలస వచ్చాం! ఇక ఇక్కడ కట్టెలమ్ముదాం. ఊరుకు చుట్టూ పెద్ద అడవున్నది. ఇంటి అటకమీద పదునైన గొడ్డలి వున్నది. ఇంకా వివరంగా చెప్పాలా? లే, కదులు!" అన్నది.

కొండయ్య మారు పలకకుండా గొడ్డలి భుజాన పెట్టుకుని అడవికెళ్ళాడు.

అడవి అంతా పచ్చగా ఏపుగా పెరిగిన చెట్లతో కళకళ లాడుతున్నది. మధ్యాహ్నం వరకు తిరిగినా వాడికెక్కడా ఎండిన చెట్టు కనిపించలేదు.

"ఏం చేసేది, నా ఖర్మ! ఏదో ఒక చెట్టు నరికిపడేస్తే, వారం రోజుల్లో అది ఎండకపోదు. అప్పుడు దాన్ని కట్టెలుగా కొట్టి పట్నంలో అమ్ముకోవచ్చు," అని కొండయ్య గొడ్డలి ఎత్తి చెట్టును నరకబోయాడు.

ఆ మరుక్షణం, "కొండా! ఆగు," అన్న కేక వినిపించింది. ఆ వెంటనే పచ్చని చీరతో నిలువెల్లా మెరిసిపోతూ ఒక స్త్రీ వాడి

"తంపు"



ముందు ప్రత్యక్షమైంది. కొండయ్య ఒక్క క్షణం నివ్వెరపోయి, ఆ స్త్రీకి భయంతో నమస్కరించి ఏదో అనబోయేంతలో, ఆమె, "కొండా! ఏమిటి ఈ అఘాయిత్యం? అడవిలోని పచ్చని చెట్టును నరకడానికి నీకు చేతులెలా వచ్చాయి!" అన్నది.

"అమ్మా తల్లీ! నా పేరెరిగినదానివి కదా, నా దరిద్రం సంగతీ ఎరిగే వుంటావు. నేనూ, భార్యాపిల్లలూ బతకడానికి ఇంత గంజయినా కావాలి కదా? అందుకోసం కట్టెలమ్మడం జీవనాధారంగా చేసుకోబోతున్నాను," అన్నాడు కొండయ్య.

అప్పుడా స్త్రీ, కొండయ్య కేసి జాలిగా చూసి, "నేను వనదేవతను! నీకు మేలు చేయదలిచాను," అంటూ చప్పట్లు చరచగానే, ముచ్చటయిన తెల్ల ఆవు ఒకటి అక్కడికి వచ్చింది.

"ఈ ఆవును మీ ఇంటికి తోలుకుపో. ఇది నువ్వు గానీ, నీ భార్య గానీ పితికిన కొద్దీ పాలిస్తూనే వుంటుంది. ఇకముందు పచ్చని చెట్లను నరకకు!" అని చెప్పి, వనదేవత అదృశ్యురాలైంది.

కొండయ్య ఎంతో ఆనందంగా గొడ్డలి భుజాన పెట్టుకుని, ఆవుతో ఇంటికి బయలుదేరాడు.

భర్త కోసం ఎదురుచూస్తున్న కొండమ్మ, వాడు సమీపించగానే, "చేతులూపుకుంటూ వస్తున్నావు! కట్టెపుల్లలేవి?" అని అడిగింది కోపంగా.

"కట్టెపుల్లలు దేనికి? కామధేనువు లాంటి ఆవునే వెంటపెట్టుకు వస్తున్నాను," అంటూ కొండయ్య, భార్యకు జరిగిందంతా చెప్పాడు.

భర్త మాటలు నమ్మని కొండమ్మ, మంచినీళ్ళ కుండలో నీళ్ళు పారబోసి, ఆ కుండలోకి పాలు తీసింది. కుండ నిండిపోయినా ఆవు పాలిస్తూనే వుంది. పట్నంలో ఆ పాలమ్మి ఇంట్లోకి కావలసినవన్నీ తీసుకువచ్చాడు కొండయ్య.

వారం గడిచేసరికి కొండమ్మ విసిగిపోయి, ఒకనాటి ఉదయం భర్తతో, "పాలు పిండి పిండి చేతులు పడిపోతున్నాయి. ఈ దిక్కుమాలిన తెల్లావును ఆ దేవత నెత్తిన కొట్టి

చెట్లు నరుకుతానని బెదిరించి, మరేదైనా మెరుగైనదానిని తీసుకురా!" అన్నది.

కొండయ్య మారుచెప్పకుండా, ఆవుతో అడవికి పోయి ఒక చెట్టును నరకబోయాడు. వెంటనే వనదేవత ప్రత్యక్షమై, "కొండా! మళ్ళీ ఏమిటీ మతిమాలిన పని?" అని అడిగింది.

"ఏం చేయను తల్లీ! పాలు తీయడం, తనవల్ల కాదంటున్నది, నా పెళ్ళాం," అన్నాడు కొండయ్య.

వనదేవత ఒక్క క్షణం ఆగి చప్పట్లు చరచగానే, తెల్లఆవు మాయమై, అక్కడ ఒక నల్లబాతు కనిపించింది.

"కొండా! ఈ బాతును పట్టుకుపో. నీ భార్య గుడ్డు పెట్టమన్నప్పుడల్లా, ఈ బాతు గుడ్లు పెడుతుంది!" అని చెప్పి దేవత అదృశ్యమైపోయింది.

కొండయ్య ఆ బాతును భుజాన పెట్టుకుని ఇంటికి వచ్చాడు. సంగతి తెలుసుకున్న కొండమ్మ ముచ్చటపడిపోయి, "చూడ చక్కనైన నల్లబాతూ! గుడ్డు, గుడ్డు," అన్నది.

వెంటనే బాతు ఒకదాని వెంట ఒకటిగా రెండు గుడ్లు పెట్టింది. రోజూ కొండయ్య వాటిని పట్నంలో అమ్ముకు వస్తుండేవాడు.

పది రోజులు గడిచేసరికి కొండమ్మ విసిగిపోయి, "గుడ్డు పెట్టు! గుడ్డు పెట్టు! అని అరిచి, అరిచి గొంతు పడిపోతున్నది. కోయిల లాంటి గొంతు ఇలా బొంగురుపోయిందేమిటమ్మా, అని పొరుగిళ్ళ అమ్మలక్కలు ఆశ్చర్యపోతున్నారు. ఈ మాయదారిబాతును ఆ





వనదేవత ముఖాన కొట్టి, కాస్త పని కొచ్చేదే మైనా పట్టుకురా. గొడ్డలి తీసుకుపోవడం మరి చేవు!" అన్నది.

మర్నాడు కొండయ్య బాతును తీసుకుని అడవిలోకి వెళ్ళి, చెట్టును నరకబోతూండగా దేవత ప్రత్యక్షమై, "కొండా! ఇదేమన్న మూర్ఖత్వం?" అని అడిగింది.

కొండయ్య తన భార్య అన్న మాటలు చెప్పాడు. ఈసారి వనదేవత చప్పట్లు చరచగానే బాతు స్థానంలో ఒక మట్టి ముంత ప్రత్యక్షమైంది.

"నీకు ఏకంగా అక్షయపాత్రనే ఇస్తున్నాను, కొండా! నువ్వు గానీ, నీ భార్య గానీ కోరుకున్న భక్ష్యాలన్నీ ఇస్తుందీ పాత్ర. ఇకనైనా పచ్చని చెట్లను పదికాలాల పాటు బతకనియ్యి," అంటూ అదృశ్యమైపోయింది వనదేవత.

అక్షయపాత్రను చూసి పరమానందభరితురాలైంది కొండమ్మ. వాళ్ళు తమ ఇంటిని పూటకూళ్ళ ఇల్లుగా మార్చారు. కొండయ్య, వచ్చినవాళ్ళు అడిగినవన్నీ రహస్యంగా అక్షయపాత్ర లోంచి తీస్తూండేవాడు. అందరికీ వడ్డించడం, ఎంగిలాకులు ఎత్తి పారేయడం కొండమ్మ పని.

అయితే, పక్షం రోజుల్లోనే ఆ పని మొహంమొత్తింది కొండమ్మకు. "వేళాపాళా లేని వడ్డనలు, అడ్డమైన వాళ్ళ ఎంగిళ్ళూ ఎత్తడం, ఇంతకు మించి నాకు వేరే పనేం లేదా? ఆ దేవత నిన్ను వెర్రిబాగులవాణ్ణి చేసి బాగా ఆడిస్తున్నది. రేపు అడవికి నీతోపాటు నేనూ వస్తాను. ఈ ముష్టి ముంత ఆవిడ మొహాన కొట్టి, నేనేం సంపాయించుకు వస్తానో, నువ్వే చూద్దువు గాని!" అంటూ భర్త మీద విరుచుకుపడింది కొండమ్మ.

ఆమె మర్నాడు అక్షయపాత్రను తీసుకుని కొండయ్యతోపాటు అడవికి వెళ్ళింది. ఒక చోట భార్య సైగ చేయగానే చెట్టును నరకబోయాడు కొండయ్య.

"ఆగు, మూర్ఖుడా! అక్షయపాత్ర ఇచ్చినా, నీ అసంతృప్తి పోలేదా? పైగా ఇప్పుడు నీ భార్యను కూడా వెంటతీసుకు వచ్చావేం?"

అంటూ వాళ్ళ ఎదుట ప్రత్యక్షమైంది వనదేవత.

అందుకు కొండయ్య ఏదో చెప్పబోతూండగా కొండమ్మ కల్పించుకుని, "ఏం చేయమంటావమ్మా? నువ్వలాంటి మట్టిముంతలు నా మొద్దుమొగుడి చేతికిచ్చి పంపిస్తూంటే, నాకు రాక తప్పింది కాదు. అక్షయంగా బంగారు కాసులు వచ్చే గోనె సంచీ ఇస్తే, ఈ అడవి ఛాయలకు కూడా రాను. ఇటువంటి అడ్డమైన వస్తువులూ, మాకు దేనికీ?" అన్నది కోపంగా అక్షయపాత్రను నేలకేసి కొడుతూ.

ముక్కచెక్కలైపోయిన ఆ పాత్రను చూసిన దేవత జాలిగా నవ్వి, "చేజేతులా మీ అదృష్టాన్ని మీరే మట్టిపాలు చేసుకున్నారు. నేనిచ్చిన వస్తువును భద్రంగా నాకప్పగిస్తేనే, మరొక వస్తువు ఇవ్వగలను!" అన్నది.

కొండమ్మ చిరుకోపంతో భర్త మీద మండిపడి, "ఆవిడ ఏమీ ఇవ్వనని చెప్పినా, అలా బెల్లం కొట్టిన రాయిలా వూరుకుంటావేం? ఊఁ, చీకటిపడేలోగా సగం అడవి నరికెయ్యి," అన్నది.

కొండయ్య, భార్యకోపం చూసి దడుసుకుని చెట్టు నరకబోయాడు.

"ఈ అడవిలో ఒక్క చెట్టును కూడా కొండయ్య నరకలేడు!" అంటూ వనదేవత అదృశ్యమైంది.

ఆ మరుక్షణం, కొండయ్య చేతిలోంచి గొడ్డలి కింద పడిపోయింది. అతడి చేతులు రెండూ తోటకూర కాడల్లా కింద వేలాడి



పోయాయి. వాటిల్లో చలనం లేదు. కొండమ్మ నెత్తీ నోరూ బాదుకుని, "మమ్మల్ని క్షమించు తల్లీ! ఇంత కఠినంగా శిక్షించడం నీకు తగదు!" అని కనబడని వనదేవతను వేడుకుంటూ పెద్దగా రోదించింది.

ఎక్కడా వనదేవత జాడ లేదు. భార్యా భర్తలిద్దరూ ఇంటికి తిరిగొచ్చారు. ఆశ చావని కొండమ్మ చాలాకాలంపాటు వనదేవతను పిలుస్తూ, అడవి అంతా కలయ తిరుగు తూండేది. సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చే టప్పుడు కుంకుళ్ళు, జిగురు, అడవి పళ్ళు తెచ్చి, వాటిని ఊళ్ళో అమ్మేది. కుటుంబం గడవడానికి అదే ఆధారం అయింది.

క్రమంగా ఆమె అడవిలోంచి నేరేడు, ఉసిరి, మామిడి, చింత మొక్కలు తెచ్చి ఇంటి చుట్టూ వున్న ఖాళీస్థలంలో నాటింది. వాటితో పాటు కాయగూరల మొక్కలు కూడా పెంచింది.

ఇలా నాలుగైదేళ్ళు గడిచేసరికి, కొండమ్మ పెంచిన మొక్కలు ఏపుగా పెరిగి ఫలసాయా న్నివ్వసాగాయి.

ఒకనాడు బాడుగ బండి నిండా మామిడి కాయలు, ఉసిరికాయలు, చింతపండు వేసుకుని పట్నం తీసుకుపోయి సంతలో అమ్మి, ఒక సంచీలో వెయ్యి రూపాయలు వేసుకుని సాయంకాలానికి ఇంటికి తెచ్చింది కొండమ్మ.

ఆమె, ఆ డబ్బు సంచీ భర్తకు చూపిస్తూ, "నిజంగా వనదేవత మన కళ్ళు తెరిపించింది. మనిషి జీవనోపాధికి చెట్లను నరకవలసిన పని లేదు; చెట్లను పెంచి ఇంకా ఆనందంగా, తృప్తిగా బ్రతకొచ్చు అనే సత్యం తెలుసుకునేలా చేసిన పుణ్యం వనదేవతదే!" అన్నది ఎంతో ఆనందంతో.

ఆ మాటలతో ఆమెకు పాపపరిహారం జరిగుండాలి — హఠాత్తుగా కొండయ్య చేతులకు చలనం వచ్చింది.

చేయిచాచి డబ్బు సంచీ అందుకోబోతున్న భర్తను చూసి, కొండమ్మ ఆనందం పట్టలేక, "ఇది నిస్సందేహంగా వనదేవత చేసిన మేలు!" అంటూ కనబడని వనదేవతకు చేతులెత్తి నమస్కరించింది.



# చందమామ కబుర్లు

## మూడేళ్ళ మేధావి!



ఉత్తరప్రదేశ్ డెహరాడూన్ రాయ్‌వాలాన్‌కు చెందిన మీనాక్షి అనే మూడేళ్ళ పాపాయి అప్పుడే సులభంగా వార్తాపత్రికలను చదవగలుగుతున్నది. అందమైన దస్తూరీతో వాక్యాలు రాస్తుంది. సునాయాసంగా రెండంకెల గుణకారం చేస్తుంది. మీనాక్షి తెలివితేటలు చూసి మురిసిపోయారు ఆమె తల్లిదండ్రులు హవీల్‌దార్ పాత్రా, మంజూషా. అయితే, ఆ పాపాయిని స్కూల్లో చేర్పిద్దామంటే, ఆమెకు ఇంకా ఐదేళ్ళు కాలేదు కాబట్టి స్కూల్లో చేర్పించడానికి రూల్సు ఒప్పుకోవని చెప్పేశారు. దాంతో తల్లిదండ్రులు నిరుత్సాహపడిపోయారు. పాపాయికి ఇంటి దగ్గర చదువు నేర్పినప్పటికీ తల్లిదండ్రులు పదవ తరగతి వరకే చదువుకున్నవాళ్ళు, బాగా చదువుకున్న వాళ్ళ శిక్షణ అయితే పాపాయికి మరింత ఉపయోగంగా ఉండేదని తల్లిదండ్రులు భావిస్తున్నారు.

## ప్రాణరక్షణ కోసం!

మెక్సికోకు చెందిన బెర్నాబ్ అకాస్టా అనే పధ్నాలుగేళ్ళ కుర్రవాడు పిడుగుపాటుకో, విద్యుద్ఘాతానికో గురై తీవ్రంగా గాయపడ్డాడు. ఒళ్ళంతా కాలిపోయి దిక్కూ మొక్కూ లేనిచోట చిక్కుకుపోయాడు. తనను అక్కడినుంచి రక్షించేవరకు అతడు కొన్నాళ్ళపాటు కాలిపోయిన తన కుడిచేతి మాంసాన్ని తింటూ ప్రాణాలు నిలుపుకున్నాడని తెలియవచ్చింది!

## నిప్పుతో చెలగాటం!

అమెరికాలోని ఓ హియో మొరేయ్‌నాకు చెందిన ఐదేళ్ళ ఆస్టిన్ మెజ్నర్ టీవీలో కార్టూన్ చిత్రాలను ఇష్టపడి చూసేవాడు. అందులో ఇద్దరు కుర్రాళ్ళు, వస్తువులన్నిటినీ తగలబెట్టడం చూసి ఆనందించి తను కూడా ఒక అగ్గిపెట్టెను సంపాయించి పుల్లలను గీస్తూ ఆడుకోసాగాడు. తల్లి అతన్ని హెచ్చరించింది. అయినా అతడు ఆ ఆటను మానుకోలేదు. ఆఖరికి అతడలా ఒకనాడు అగ్గిపుల్లలతో ఆడుకుంటూన్నప్పుడు అతని చెల్లెలకు నిప్పంటుకుని ఆమె మరణించింది!

## కాపాడిన పోలీసుకుక్క!

ఇటీవల మహారాష్ట్రలో జరిగిన భూకంపంలో మంగ్రూర్ అనే గ్రామంలో 18 నెలల ఆడ శిశువు రాళ్ళూరప్పల కింద పడిపోయింది. ఆ పాప అలాగే నాలుగు రోజులు ఉన్నది. ఫ్రాన్స్ దేశానికి చెందిన 38 మంది గల రక్షక బృందం తీసుకువచ్చిన ఒక పోలీసు కుక్క వాసన చూసి, రాళ్ళ కింద మనిషి ఉన్నట్టు సూచించింది. వెంటనే రాళ్ళూరప్పలను తొలగించి ఎనిమిదడుగుల లోతులో స్పృహ కోల్పోయి పడివున్న పాపను పైకి తీసి కాపాడారు!





# విధికి విరుగుడులేదు

ఒక గ్రామంలో ఒక రైతు వద్ద సంజయ్య అనే గొడ్లకాపరి కుర్రవాడుండేవాడు. వాడు రోజూ ఉదయమే లేచి, తన యజమాని ఇంటి చాకిరి చేసి, చద్ది తిని, బారెడు పొద్దెక్కేసరికల్లా గొడ్లను మేపటానికి తోలుకుపొయ్యేవాడు.

గ్రామం వెలుపల ఒక పాడుపడిన తోట ఉండేది. ఒకప్పుడు దానిలో మంచి మంచి ఫలవృక్షాలుండేవి. కాని ఇప్పుడు దానికి ఆలనా పాలనా లేదు. తోటంతటా ఏవేవో పిచ్చిమొక్కలు మొలిచాయి. గడ్డి విపరీతంగా పెరిగింది. ఆ తోటలో పశువులకు కావలసినంత మేత. మేపుకుంటే అడిగేవాళ్ళు లేరు. గొడ్లు కాసే కుర్రాళ్ళు ఎక్కి ఆడుకోటానికీ, కాయలు కోసుకుతినటానికీ చెట్లు కూడా ఉన్నాయి. అందుచేత సంజయ్య తోటివాళ్ళు కూడా పశువులను తోలుకుని ఆ తోటకే వచ్చేవాళ్ళు. పశువుల దారిన పశువులు మేత మేసేవి, కుర్రాళ్ళ దారిన కుర్రాళ్ళు సాయంకాలం దాకా ఆడుకుని, పొద్దు వాలగానే మళ్ళీ గ్రామానికి తిరిగి వెళ్ళేవాళ్ళు.

ఒకనాడు సంజయ్య పశువులను తోలుకుని మామూలు ప్రకారమే తోటకు వచ్చాడు. కానీ, ఆ రోజు పండగ కావటం చేత మిగిలిన కుర్రాళ్ళెవరూ రాలేదు. పండగ మాట సంజయ్యకు తెలీదు. బిక్కుబిక్కుమంటూ తోటలో ఒంటరిగా ఉండటం వాడికేమీ బాగాలేదు. తన చిరాకు పశువుల మీద చూపి, వాటిని వాటి మానాన మేయనివ్వక ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ మళ్ళించాడు.

అసలే చిరాకులో ఉన్న సంజయ్య మీద ఒక కందిరీగ ఎటునుంచో వచ్చి వాలింది. అది తనమీదికి రావటం చూస్తూనే ఉండటం చేత వాడు దాన్ని ఒక్క చరుపు చరిచి చంపేశాడు. అప్పటికీ కసితీరక వాడు దాని కళే

బరాన్ని రెండుగా విరిచి విసిరి ఎడంగా పారేశాడు. అది ఒక దుబ్బు మీద పడుతూనే ప్రాణం వచ్చి తుంయిమని క్షణంలో ఎగిరిపోయింది.

సంజయ్య నిర్ఘాంతపోయి, కందిరీగ కళేబరం పడినచోటికి వెళ్ళి జాగ్రత్తగా గమనించాడు. అది ఒక పొట్టి దుబ్బు మీద పడింది. ఆ దుబ్బు నిండా దట్టంగా ఆకులున్నాయి. ఆ ఆకులు మిగిలిన ఆకుల్లా కాకుండా ఎంతో నేవళంగా ఉన్నాయి. ఆ ఆకుల మహిమ వల్లే చచ్చిన కందిరీగ బతికి ఉంటుందని వాడికి తోచింది. సంజీవి మొక్కలను గురించి వాడు విని ఉండటం చేత అది సంజీవిమొక్క అయి ఉండవచ్చుననుకుని వాడు దాన్ని జాగ్రత్తగా గుర్తుంచుకున్నాడు.

సంజయ్య కింకా ఈ సంజీవి మొక్క పైన పూర్తిగా నమ్మకం కుదరలేదు. ఆ దుబ్బు మీద నుంచి ఎగిరిపోయినది తాను విసిరేసిన కందిరీగ కాదేమో! వాడు తోటంతా వెతికి ఒక చచ్చిపోయిన మిడత శరీరం సంపాదించి తెచ్చి, దాన్ని నింపాదిగా సంజీవి మొక్క పైన ఉంచాడు. ఒక క్షణంలో అది కదిలి, చివ్వున ఎటో ఎగిరిపోయింది.

అది తప్పక సంజీవి మొక్కేననీ, దాన్ని తాకిస్తే ఏ చచ్చిన ప్రాణి అయినా తిరిగి బతుకుతుందనీ సంజయ్య రూఢి చేసుకున్నాడు. ఇది తన తోటి కుర్రాళ్ళకు ఎప్పుడు



చెబుతానా అని వాడు తహతహలాడసాగాడు.

కాని మర్నాడు కుర్రాళ్ళంతా పశువులను తోలుకుని తోటకు వచ్చే దారిలో, వాడు మిగిలిన వాళ్ళతో తాను సంజీవిమొక్కను కనిపెట్టాననీ, దానితో చచ్చిన కందిరీగనూ, మిడతనూ బతికించాననీ చెబితే, వాళ్ళు ఆశ్చర్యపడటానికి బదులు వాణ్ణి గేలిచేసి ఏడిపించారు. సంజయ్యకు వాళ్ళమీద కోపం వచ్చి తన రహస్యం రహస్యంగానే ఉంచేశాడు.

కొద్ది రోజులు గడిచాయి. ఒకనాటి తెల్లవారుఝామున ఊరి కామందు చనిపోయాడు. ఆ కామందు ధనికుడే కాక గొప్ప దాత కూడాను. గుళ్ళు కట్టించాడు, ఇళ్ళు

కట్టుకునే వాళ్ళకూ, పెళ్ళిళ్ళు చేసుకునే వాళ్ళకూ ఎన్నో దానాలు చేశాడు. అందుచేత గ్రామంలో వాళ్ళు ఆయన్ని దేవుడల్లే చూసుకునే వారు.

ఆయన నెలరోజులు మంచాన తీసుకుని మరీ పోయాడు. ఈ నెల రోజులూ ఆయనకు వైద్యులు ఎన్నో రకాల చికిత్సలు చేశారు. కాని ఒక్కరి ప్రయత్నమూ ఫలించలేదు.

ఉదయంవేళ కామందు ఇంటి ముందర జనం గుమిగూడారు. కొందరు కామందును పొగుడుతున్నారు. కొందరు శ్మశాన వైరాగ్యం చెబుతున్నారు. "వైద్యులంటే మందులివ్వగలరు గాని ప్రాణం పొయ్యగలరా?" అని శాస్త్రులుగారు అంటున్నాడు.

ఈ మాట సంజయ్య చెవులబడింది; వాడు ఆ సమయానికి అటుగా పశువులను తోలుకుని తోటకు పోతున్నాడు. వాడు జరిగిన సంగతి తెలుసుకుని, "కామందు గారిని బతికించే ఉపాయం నేను చెబుతాను. పాడుపడినతోటలోసంజీవి మొక్క ఉన్నది," అంటూ తన అనుభవం అక్కడి వారితో చెప్పాడు.

చాలామంది వాడి మాటలు నమ్మలేదు. ఒకరిద్దరు, దింపుడు కళ్ళాశగా వాడి వెంట తోటకు బయలుదేరారు. సంజయ్య ముందూ, గ్రామస్తులు వెనకా తోటలో ప్రవేశించారు. తాను చూసిన దుబ్బు ఎక్కడుండేదీ వాడికి తెలుసు. దాదాపు రోజూ వాడు దాన్ని ఒక్కసారైనా కళ్ళచూస్తూనే ఉన్నాడు. అందుచేత వాడు సూటిగా అక్కడికే దారితీశాడు. కానీ రోజూ కనిపించే ఆ నవనవలాడే ఆకులు వాడికి కనిపించలేదు. ఇది కాదు అదీ, అది కాదు ఇదీ అనుకుంటూ వాడు ఒక దుబ్బు నుంచి, ఇంకో దుబ్బుకు నడవసాగాడు.

గ్రామస్తులకు వాడిమీద కోపం వచ్చింది. వాళ్ళచేత మాటలు పడటం ఒక వంకా, రోజూ కనిపించే దుబ్బు మాయం కావటం ఒక వంకా సంజయ్యను బాధించాయి. వాడు తోటంతా పదిహేనుసార్లు తిరిగినా, ఆ దుబ్బు జాడ వాడికి తెలియనే లేదు.

ఇంతకూ పోయిన కామందు తిరిగి బతికే గీత లేదు. అందుకే ఎదురుగా ఉన్న సంజీవి కూడా సంజయ్యకు కనిపించక పోయింది.



# ప్రకృతి వింతలు

## పాములు మెల్లగానే పాకుతాయి!



పాములు వేగంగా పాకుతాయనుకోవడం కేవలం అపోహ మాత్రమే. నిజానికి అవి చాలా మెల్లగా కదులుతాయి. కొన్ని సమయాలలో మాత్రం, ముఖ్యంగా ఆహారాన్ని పట్టుకోవడానికి అవి వేగంగా వెళతాయి. భూచరాలైన పాములలో నల్ల త్రాచు జాతి పాములు గంటకు పది మైళ్ళ వేగంతో పాకుతాయి. ఇవే అన్నిటిలోకీ చాలా వేగంగా పాకే పాములు!

## మొలకలెత్తే బంగాళా దుంప



ముదిరిన బంగాళాదుంపను ఒక చోట అలాగే కొన్నాళ్ళు పడవేసి ఉంచినట్టయితే దానిమీది చిన్నచిన్న బుడిపల్లాంటి రంధ్రాల నుంచి మొలకలు పుట్టుకొస్తాయి. ఆ మొలకలు బతకడానికి కావలసిన ఆహార పదార్థాలు దుంప లోపల పుష్కలంగా లభించడంవల్ల అవి క్రమంగా పెరుగుతాయి.

## ఎగిరే 'నక్క'!

గబ్బిలాలు చాలా చిన్నవి. వాటి తలలు చిట్టెలుక తలలాగా ఉంటాయి. అయితే 'కబోదిపక్షి' వంటి ఒకరకం గబ్బిలం తల నక్కతలలాగే ఉంటుంది. అందువల్ల వాటిని ఎగిరే 'నక్కలు' అని అంటారు. ఈ గబ్బిలాలు చిన్న కుక్కల ప్రమాణంలో ఉంటాయి. వీటి రెక్కల పొడవు ఆరడుగులు. మామూలు చిన్న గబ్బిలాలు శబ్దం మీద ఆధారపడి ఎగురుతాయి. అయితే, ఈ పెద్ద ఎగిరే నక్కలకు చూపు బాగా ఉంటుంది. ఇవి మనదేశంలో అక్కడక్కడ ఉన్నాయి.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.


N. Sambasiva Rao


M. Natarajan

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) *డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కనులవిందుగా పడవల రేవు!    రెండవ ఫోటో : కానీ లేదు మావద్ద కేవు!

పంపినవారు : శ్రీమతి శింగరాజు రాజేశ్వరి, W/o, ఎస్.వి. హనుమంతరావు. 2/860/4 — బి,
నయీం నగర్, వరంగల్లు — 506 009 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**




National-960


Say
so long
to every
other
toffee
Bakeman's
DRUM BEAT
Bakeman's are proud to announce the luxury length toffee you've been longing for, in 3 unbeatable flavours: Chocolate, Milk and Coconut.

